# SRI BASAVESWARA'S MISSION

"It was the distinctive feature of his mission that illustrious, religious and social reformers in India before him had each laid his emphasis on one or other items of religious and social reform, either subordinating more or less other items to it, or ignoring them altogether. Basawa sketched and boldly tried to work out a large and comprehensive programme of social reform with the elevation and independence of womanhood as its guiding point.

Neither social conferences which are annually held in these days in several parts of India, nor Indian social reformers, can improve upon that programme as to the essentials. As was in substance remarked by the late Sri James Campbell, whose knowledge of Indian History, customs and manners was almost phenomenal, the present day social reformer in India is but speaking the language and seeking to enforce the mind of Basawa."

శైవసేవా సమితి ద్వితీయ ప్రచురణ

# బసవేశ్వర చరిత్రము



సంగ్రహకర్త:

నూతక్కి కోటయ్య, బి. ఏ.



ప్రకాశకులు:

శైవసేవా సమితి

1-8-9 శ్రీరామనగర్,

కాకినాడ-3.

కాని గ్రంథము మొదలుకొని అత్యంతముల నన్వయించుకొని యోచించుచు కొనుటలో శ్రమ యెక్కువ యనుటయు వాస్తవమే. విషయ సంగ్రహణము సమగ్రదర్శనమునకు సహకరించును. తక్కువ పరిశ్రమతో పాఠకు డెక్కువ ప్రయోజనమును సాధించుకొనును. ఈ విషయమును సూచించినట్లుగా కోటయ్యగారు గ్రంథాకారవిషయమున నైతము సంగ్రాహకులుగానే వర్తించిరి. మొత్తము గ్రంథమును 1. అవతారిక 2. బసవేశ్వరుని జననము 3. బసవేశ్వరుని ఉపనయనము 4. విద్యాభ్యాసము-శివదీక్ష 5. ఆనాటి మతసాంఘిక పరిస్థితులు 6. బిజ్జలు నాస్థానములో సమాగమము 7 బిజ్జలుడు 8. మంగళవాడలో బసవన్న మహోద్యమము 9 బిజ్జలునితో వైషమ్యము 10. బిజ్జలుని ఆహ్వానము 11. కళ్యాణములో ఉద్యమ ఘనవిజయము 12. అనుభవమంటపము: అల్లమప్రభువు 13 బసవేశ్వరాదు లొనర్చిన మహిమలు 14. బసవేశ్వరుని శీలము 15. బిజ్జలుని అత్యాచారము: కళ్యాణములో సంక్షోభము 16. బసవేశ్వరుని వచనాలు 17. ఉపసంహారము- అను శీర్షికలతో పదునేడు ఘట్టములుగా విభాగించిరి. దాదాపు ప్రతిఘట్టము నొకటి రెండు పద్యముల నుపక్రాంతిగా చేసికొనియే యుపక్రమించుట జరిగినది. ఉద్దిష్టమో! అనుద్దిష్టమో! కవితాప్రియులకు నైతము కమ్మని విందు లభించినది.

కొన్ని సందర్భములందు చరిత్ర యొకవంకకు లాగగా సాహిత్య మింకొకవంకకు లాగుచుండును. ఇట్టిచోట్ల రచయిత తన వివేచన శక్తిని సమయముగా నుపయోగింపవలయును. వర్ణనల విషయమునందు పాల్కురికివారి బసవపురాణమునే యనుసరించినప్పటికిని, సన్నివేశములందు చరిత్ర సాక్ష్యములనే యనుసరించుట కోటయ్యగారి సముచితదృష్టికి నిదర్శనము. సాంప్రదాయికమైన విశ్వాసమునుబట్టి బసవేశ్వరుడు ముప్పదియారేండ్లుమాత్రమే జీవించియుండెను. చారిత్రకములైన సాక్ష్యమునుబట్టి ఆయన అరువది రెండు సంవత్సరములు జీవించియుండెను. ఏది సత్యము? ఏది అసత్యము? వేఱుసాక్ష్యము లేనప్పుడు, ఒకదానిని స్వీకరించి యొకదానిని నిరాకరించుట పాక్షికత్వమే యగును. కోటయ్యగారు తద్దోషమునకు పాలుగాకుండ, ఒక సమన్వయమార్గము నవలంబించిరి. వారి తీర్పుప్రకారము బసవేశ్వరుని

జీవితకాలము అఱువది రెండు సంవత్సరములే; ఆయన యుద్యమకాలము ముప్పది యేండ్లు. బాల్యవిద్యాభ్యాసాదులకు మిగిలిన కాలము పోగా, ముప్పది యేండ్ల యుద్యమకాలమును సఫలజీవితముగా సాంప్రదాయికులు పరిగణించుట సరిపోయుండును. ఇది సమంజసమైన నిర్ణయము.

మహిమలవిషయమునందైతము కోటయ్యగారి నమ్మకత్వ మంత కాదనరాదు. అత్యుక్తులు, అతిశయోక్తులు నమ్మ తెప్పలుగా నుండవచ్చుననియే ఆయన విశ్వాసము. ఏమతమున కైనను ప్రజాసామాన్యమునందు ప్రతిష్ఠ గలుగవలయునన్న మహిమలు, నద్భుతములు తప్పవు. కొన్ని యథార్థములే కావచ్చును; కొన్నియైన నతిశయోక్తు లుండకపోవు. అయినను బసవపురాణమునుండి సారార్థము నుద్ధరించి చూపిరి.

కొన్నియెడల రచయిత వ్యాఖ్యాతగా కనుపట్టును. 'పరవనితాజన ఘనకుచతట ముఖమండల వీక్షణ విధి జాత్యంధాత్' అన్న వాక్యభాగమును వ్యాఖ్యానించుచు జ్ఞానచక్షువు చారచక్షువు నైన బసవేశ్వరుని సోమనాథుడు జన్మాంధునిగా వర్ణించెను. పరస్త్రీ ముఖవీక్షణవిషయమున జన్మాంధుడనుట ఉక్తివక్రతకు లక్ష్యము. కోటయ్యగారీ రీతివిషయము లను దాటవేయక సహృదయరంజకముగా వ్యాఖ్యానించిరి.

తుల్యయోగ మన్నది మరొక యంశము. బసవేశ్వరునినాటి సంస్కారోద్యమమే ప్రధానవిషయము. నేటి సంస్కారోద్యమములతో దానిని జోడించి మంచి చెడ్డలను గమనించుటయే తుల్యయోగము. నేటి ప్రధానోద్యమములైన వర్ణనిర్మూలనము, అస్పృశ్యతా నివారణము, స్త్రీజనోద్ధరణము మున్నగునవి బసవేశ్వరుని కాలమునందే యున్నవనుట ఒక కనువిప్పు కాగలదు. ఉద్ధరణ మెట్లుండవలయును? మత మాచరణమునకు దూరముగా నుండవచ్చునా? మున్నగు ప్రశ్నలకు మంచి సమాధానము లీయా ఘట్టము లందు గోచరించును.

కొన్నియెడల రచయిత నిరుక్తకారులుగా వ్యవహరించిరి. మఠము, దీక్ష, లింగము, వీరశైవులు - మున్నగు పదములకు ఆగమశాస్త్రము ననుసరించి

వీరు చూపిన ప్రయత్నములు పాఠకుల యవగాహనకు తప్పక దోహదము గావించును.

ఇంతవరకు చెప్పిన యంశము అన్నియు నొకయెత్తు; అవతారిక యొక్కటి ఒకయెత్తు. పదునైదు పుటలలో వీరశైవదర్శనము నంతటిని సంగ్రహించి ప్రదర్శించిన కోటయ్యగారిని ప్రశంసింపక తప్పదు. "బసవేశ్వరుని జీవితమందలి ముఖ్యసన్నివేశములు" అన్న యనుబంధము చారిత్రిక ప్రాధాన్యము కలిగి చదువరుల జ్ఞాపకశక్తికి మిక్కిలి సహకరింపగలదు.

గ్రంథమునందంతట బసవేశ్వరుని జీవితమును ప్రత్యక్షీకరించి సజ్జన సాంగత్యఫలమును, బసవేశ్వరుని వచనముల వినిపించి కవితోక్తుల సంతరించి సారస్వత రసాస్వాదఫలమును శ్రీ కోటయ్యగారు చదువరుల కందజేసిరన్నది సత్యము; పునః పునరుక్తము కాదగిన సత్యము. అస్తు.

—స్వా. రి. శ్రీ

# అ భి ను తి

శ్రీ సాంత్వికస్ఫూ వంశసు
ధానిధి! కోటయ్యబుధ! సుధామధురవచ
శ్రీనిధి బసవేశ్వరగా
థా నిర్మల వచనరసతాత్పర్యనిధీ!

శివభక్తి స్ఫురణోజ్జ్వలంబు సరళశ్రీశబ్దమాధుర్యసం
భవదర్థ స్ఫురణోజ్జ్వలంబు శివతత్త్వజ్ఞానసంపన్నమా
భవదుద్యద్బసవేశగాథ నిలసద్భక్తాళికిన్ వీరశై
వవిశేషంబులు చాటి కోటయసుబుధా! వర్ధిల్లు నాంధ్రావనిన్.

ఆంధ్ర కర్ణాట భాషాసముచితములు
బసవగాథలు నైవిధ్యలసితగతులు;
బహుళపరిశోధనమునఁ దన్మహితసార
మెల్లఁ దివిచెను మీ "బసవేశచరిత".

మండగి మాదిరా ద్బసవమాన్యచరిత్రము శైవభక్తికిన్
బండరు వద్ది గూరిచి భవద్వరలేఖని వీరశైవస
న్మండనమై సుధీజనగణస్తవనీయనిరూఢి గాంచుఁగ
న్పండువు గాఁగ భక్తుల మనస్సరసీరుహముల్ రహింపఁగన్.

పౌరాణికత్వధోరణి
చారిత్రకమై జగతులు సమరసగతి నిం
పార బసవేశ్వరచరిత
గూరుచు మిమ్మభినుతింతు; కోటయ్యబుధా!

రేపల్లె,
8-5-1975.

— గిద్దలూరు చెంచుబసవరాజు

# విజ్ఞప్తి

కన్నడదేశమందు జన్మించి, కన్నడభాషలోనే తన తత్త్వము నంతయు వచనరూపమున ప్రవచించి, అచ్చటనే రాజాస్థానములో ఉన్నత పదవులు నిర్వహించుచు, అపూర్వ సంఘసంస్కరణముతోపాటు వీరశైవమతోద్ధరణము గావించిన మహనీయుడగు బసవేశ్వరుని చరిత్రను తొలుదొల్త తెలుగుభాషలో బసవపురాణ మనుపేర ద్విపదకావ్యముగా రచనచేసిన ఖ్యాతి పాల్కురికి సోమనాథునకు దక్కినది. ఆ తరువాతనే బసవేశ్వరుని గూర్చిన గ్రంథములు కన్నడ భాషలో రచింపబడినవి. కాని పూర్వకవివిరచితములగు బసవచరిత్ర లన్నియు మహిమోపేతములగు గాథలతో నిండియుండుటచే, సహజ చారిత్రకదృక్పథము ననుసరించి యవి రచింపబడకుండుటచే, బసవేశ్వరు డనువ్యక్తి అసలు చారిత్రకపురుషు డగునా కాదా యనుశంక మొన్నమొన్నటి వరకు చరిత్రకారులను వేధించుచునే యుండెను. అదృష్టవశాత్తు బసవేశ్వరునిగూర్చిన శాసనాధారము లిటీవల తగినంతగా లభ్యము లగుటచే బసవేశ్వరుని చారిత్రకత సుస్థిరముగా నెలకొల్పబడి, తచ్చరిత్రము నూతనాంశముల కనుగుణముగా పునర్వీక్షింపవలసిన యావశ్యకతయుగూడ నేర్పడినది.

ఇటీవల బసవేశ్వరునిగూర్చి వెలువడిన పరిశోధన గ్రంథములలో తలమానికముగా నెన్నదగినది కీ॥ శే॥ పి. బి,

దేశాయిగారి ఆంగ్లగ్రంథము. వీరు ధారవాడ యూనివర్సి టీలో చరిత్రశాఖాధ్యక్షులుగా నుండి యపూర్వ పరిశోధనా ఫలితముగా నీ గ్రంథమును వెలువరించియున్నారు. పూర్వ సాహిత్యగ్రంథములలో లేని వినూత్నవిషయము లెన్నిటినో శ్రీ దేశాయిగారు తమగ్రంథములో తగిన యుపపత్తులతో నిరూపించియున్నారు.

ఉదాహరణకు: పూర్వగ్రంథములలో బసవేశ్వరుడు ఉద్యోగము నిర్వహించిన చోటును, మతపరమైనకృషిని కొనసాగించిన చోటునుగూడ కళ్యాణనగరమనియే చెప్ప బడియున్నది. తొలుత బిజ్జలుని రాజధానియగు మంగళ వాడలో బసవేశ్వరుడు ఉద్యోగములో ప్రవేశించి అచ్చటనే యిరువదేండ్లు తన మతసాంఘికసంస్కరణోద్యమమును నడిపి నట్లును, ఆతరువాతనే తన ఉద్యమ కార్యరంగమును కళ్యాణ నగరమునకు మార్చినట్లును ఇటీవలి పరిశోధనలవలన రూఢి యైనది.

ఏవంవిధ నూతనచరిత్రాంశములను చేర్చి తెలుగులో సులభశైలిలో సంగ్రహరూపమున బసవేశ్వరచరిత్రను లిఖిం చినచో సామాన్యపాఠకులకు ముఖ్యముగా స్త్రీలకు అత్యం తోపయుక్తముగా నుండునన్న భావన నాకు కలిగి, మన్మి త్రులు, భాషాప్రవీణులు నగు శివశ్రీ చెంచు బసవరాజుగారిని తద్రచన గావించుటకు అభ్యర్థించితిని. కాని వారేలొకో అందులకు సుముఖత చూపరయిరి. నేనే ఆపనికి పూనుకొని,

అనుబంధములో పేర్కొన్న గ్రంథములను తిలకించి, నా సామర్థ్యమందలి శంక నన్ను అడుగడ్డునకు అడ్డుచున్నను, వలయు విషయసేకరణ గావించి, ఈ గ్రంథము నిట్లు పూర్తి చేసి, ఆంధ్రలోకమున కందించగలిగితిని. ఈ గ్రంథరచనకు గాను నాకు సోదరతుల్యులు, నిరంతరాధ్యాత్మిక చింతనాపరులు, భక్తవరేణ్యులు నగు శివశ్రీ వల్లం శ్రీరంగమూర్తిగారిచ్చిన ప్రోత్సాహము మరువరానిది.

నా కోర్కె మన్నించి గ్రంథమునకు అమూల్యమగు ఆముఖమును అనుగ్రహించిన మాన్యశ్రీ సూర్యశ్రీ గారికిని, అభినుతి యనుపేర తమ అభిప్రాయము నొసగిన భాషాప్రవీణులు శ్రీ గిద్దలూరు రెంచుబసవరాజుగారికిని నా నమస్సుమనస్సులు.

ఏతద్గ్రంథ ముద్రణాదికమునకై శ్రీమతి రుద్రాక్షుల చిట్టెమ్మగారు తమ భర్త కీ॥ శే॥ శరభయ్యగారి జ్ఞాపకార్థము రు 500_00 లు విరాళముగా నిచ్చి బసవేశ్వరుని కృపకు పాత్రులైరి. వీరియెడ గల నా కృతజ్ఞతను పద్యరూపమున వ్యక్తముచేసికొనుచున్నాను.

కాకినాడ,
10_5_75.

—నూతికట్టు కోటయ్య



శ్రీ బసవేశ్వరుడు
(క్రీ శ. 1105 _ 1167)



కైలాసవాసి శ్రీ రుద్రాక్షుల శరభయ్యగారి ధర్మపత్ని
శ్రీమతి రుద్రాక్షల చిట్టెమ్మగారు

# కృతజ్ఞత

విమలగోదావరీ సరిద్వీచికావి
చలితమృదుశీతపవన సంకలితమగుచు
బహుళ కేదారసస్య సంభరితమగుచు
మున్న నంగాంచె లంకలగన్నవరము.

ఆజనపదంబు డొక్క సీతమ్మయను సు
సాధ్వి నిరతాన్నదాత్రియై సద్యశమ్ము
గనినకతన డొక్కావారి గన్నవరము
గా వినుతికెక్కె, నచటి లింగాంగులందు.

శ్రీరుద్రాక్షులవంశవార్ధిశశియై చెన్నొంది యుద్యంచితా
కారుండై మృదుభాషణాకుశలుడై గౌరీధవారాధనా
పారీణుండయి బంధుమిత్రజనసంభావ్యుండునై కీర్తివి
స్తారుండై శరభాహ్వయుండు గనియెన్ ధన్యత్వమాన్యత్వముల్

నలువదేండ్లు నిండని నడిమిప్రాయ
మందె శివలోకమునకు తానందుకొనియె
డెందమున మెచ్చి యితని బాలేందుమౌళి
తలప సుకృతిగ తాయువక పలుకు నిజము.

అంత ధర్మపత్నియైన చిట్టెమ్మ పై
ధవ్యజనితశోకతప్త యగుచు
మనసునిగ్రహించుకొని సంతతియు దాను
అన్నగారియూరి కరిగియచట.

తనపుట్టినింటివా రొసఁ
గిన క్షేత్రగృహాదులకు స్వకీయంబగు చి
క్కనిమంచితనము జతగా
మనజొచ్చెఁ బంధుజనులు మదిలో మెచ్చన్.

ఇరువురుపుత్రికలును న
ల్లురు దత్సంతతియు స్వజనులున్ ముదమిడఁగా
పురహరు నారాధించున్
నిరతము పతిదేవు నెంచు నెమ్మనమందున్.

సాదరంబుగ నిజభర్తృ జ్ఞాపకార్థ
మీమె "బసవేశ చరిత" ముద్రించుటకును
వలయుధనమిచ్చి బదులుగాబడసె మోక్ష
సాధనంబైన విమలసంశోధనంబు.

బసవేశు డపరనందీశు
డసితాంగుకు భక్తలోకవంద్యుడు కడు నా
దసదృష్టిజూచి యీమెకు
నసమానసుఖంబు లొసఁగి యిష్టార్థము లిడుతన్.

—మారికట్టు కోటయ్య, బి. ఏ.

# విషయానుక్రమణిక

శ్లో॥ యస్సంగీత్రనిర్నిర్కృమాహురభవం
యేనార్చితం సూనృతం
యస్మైస్వస్తి యతస్త్వదీయముదభూత్
యద్వీరశైవవ్రతం
యస్యాపాంగ సహోదరీచ కరుణా
యస్మిన్ మహాత్మ్యాదయః
సత్వాం త్రీణిజగంతి పాహి బసవా
మార్త్యేశన్యాడానుణే !

# బసవేశ్వర చరిత్రము

శ్రీ గురులింగతత్పరు, నశేషజగన్నిధి, శుద్ధతత్త్వసం
యోగసుఖప్రపూర్తి, వృషభోత్తమమూర్తి, యుదాత్తకీర్తి, ది
వ్యాగమమార్గవర్తి, బసవయ్య, కృపాంబుధి మీకు దివ్యసం
భోగములన్ ప్రసాదసుఖభోగములన్ గరుణించుగావుతన్.

(పా॥ సోమనాథకవి)

ధరణిని వీరశైవమతధర్మము సన్నగిలంగ, తన్మతో
ద్ధరణమునై శివాజ్ఞ తలదాల్చి జనించి, యపూర్వసంఘసం
స్కరణముతో మతోద్ధరణ సల్పిన శ్రీ బసవేశు నెమ్మదిన్
స్థిరముగ నిల్పి కొల్చెదను దివ్యసుఖానుభవోపలబ్ధికై.

(మదీయము)

## 1. అవతారిక

అపరనందీశ్వరుడగు బసవేశ్వరుని పవిత్ర చరిత్ర భక్తజనుల కవశ్య పఠనీయము. కర్ణాటక దేశమందు పండ్రెండవ శతాబ్దిని వెలసిన కళ్యాణ బసవేశ్వరుడు క్షీణదశయందున్న వీరశైవమతమును సముద్ధరించి, క్రొంగొత్త సంస్కరణలతో ఆ మతమునకు నూతనోత్తేజమును బహుళవ్యాప్తియు గలిగించి, లోకకల్యాణమునకై కృషిసల్పిన యుదంతము సర్వజనవిదితము. అట్టి మహనీయుని జీవితచరిత్రాంశములను పాఠకమహాశయులకు అందించుటకు ముందుగా, వీరశైవమత విశిష్టసిద్ధాంతముల సంగ్రహపరిశీలనము గావించుట సముచితముగాన తత్పరిశీలనమును అవతారికాభాగములో జేర్చినాడను.

## మత మనగా నేమి?

ఈ చరాచరసృష్టి యావత్తు సహజముగా దానంతట దానే యేర్పడి నిర్విరామముగా సాగుచున్నదా లేక దానిని సృష్టించి రక్షించు కారణ మేమయిన నున్నదా యను జిజ్ఞాస అనాదికాలమునుండి యున్నది. ఇందువిషయమై జరుగు చర్చకే మత మను వ్యవహార మేర్పడినది. మత (ఆలోచించు) అను ధాతువునుండి మతము అను శబ్దము పుట్టినది. బాహ్యదృష్టికి గోచరించెడి సృష్టి తనంతట తా నేర్పడినది కాదనియు, దీనికి కర్త (కారణము) యైన యద్భుతశక్తి యొకటి యుండియుండు ననియు బహుదేశముల విజ్ఞు లభిప్రాయపడుచున్నారు. ఇట్టిదని చెప్పరాని ఈ మహాద్భుతశక్తినే, పరతత్త్వము, పరమేశ్వరుడు, భగవంతుడు నని వ్యవహరించుచున్నారు. కావున దేవుని యునికిని (అస్తిత్వమును) అంగీకరించుమతములు ఆస్తికమతము లనియు, ప్రపంచమును, దాని సృష్టిస్థితిలయములును వేఱొకశక్తివలన గాక, ప్రకృతిసిద్ధముగ నేర్పడునవే యని తలంచు మతములు నాస్తిక మతములనియు వ్యవహరింపబడుచున్నవి.

## మత త్రయము

పరమేశ్వరుని యంశము సూక్ష్మముగ సమస్త జీవులయందు నున్నది. ఆ జీవాత్మకు పరమాత్మకు (పరమేశ్వరునకు) గల సంబంధము గుఱించి భరతఖండమున మూడు ముఖ్యమతములు నెలకొన్నవి. అవి అద్వైతము, విశిష్టాద్వై

తము, ద్వైతము. నిత్యము, సత్యము, నిరంజనము నైనది పరమాత్మయొకటే; ఇతరమంతయు (జగత్తుకూడ) మిథ్య; జీవాత్మ పరమాత్మ యొక్కటే; వేఱు వేఱు కావని నిర్వచించునది యద్వైతమతము. దీని నే సర్వాద్వైతము అని గూడ చెప్పెదరు. ఈ సిద్ధాంతము నుద్ధరించినది శంకరాచార్యుడు. పరమేశ్వరుడు కారణముగా నుద్భవించిన జగత్తు మిథ్య కానేరదనియు, భక్తి సత్ప్రవర్తనము మున్నగు సాధనములచే జీవుడు శుద్ధుడయి క్రమముగ నుత్తమస్థితిలో పరమేశ్వరునితో సమానుడయి వఱలుననియు ప్రతిపాదించుచు, సర్వాద్వైతము నంగీకరింపక, దానికి విశిష్టముగ నేర్పడినది విశిష్టాద్వైతము. ఈ సిద్ధాంతము నుద్ధరించినది రామానుజాచార్యుడు. భక్తి మున్నగు సాధనలచే శుద్ధుడయినప్పుడు గూడ జీవుడు ఈశ్వరుని ప్రేమవాత్సల్యములకు పాత్రుడయి యాతని సమీపమున దాసభావముతోనే యుండుననియు, జీవేశ్వరులకు సేవకునకు ప్రభువునకువలె విభేదము సర్వదా నర్తిల్లు ననియు చెప్పునది ద్వైతము. దీని నుద్ధరించినది మధ్వాచార్యుడు.

## వీరశైవము

ఈ మూడు మతముల కంటె విలక్షణమయిన శక్తి విశిష్టాద్వైతము వీరశైవుల సిద్ధాంత మైయున్నది. వీరశైవ మతమునకు భేదాఽభేద సిద్ధాంతము, ద్వైతాఽద్వైత సిద్ధాంతము అను నామములు కూడ కలవు. ఈ సిద్ధాంతములను గూర్చి అవతారిక చివరను వివరించెదను.

వేదములందు పరమేశ్వరతత్త్వము, అగ్ని, రుద్ర, భర్గ, శివేత్యాదిగ వేర్వేఱు నామములతో వ్యవహృతమయినను రానురాను అది సులభోచ్చారణసంయుతమగు శివశబ్దమునందు నిక్షిప్తమయినది. "శివస్య ఇదం శైవమ్" అను నిష్పత్తిచే శైవశబ్ద మేర్పడినది. భారతదేశమందలి మతములలో శైవము మిక్కిలి ప్రాచీనమయినది. ఇందులో సామాన్య శైవము, మిశ్ర శైవము, పూర్వ శైవము, శుద్ధ శైవము, శ్రౌత శైవము, మార్గ శైవము, వీరశైవము, సామాన్య వీర శైవము, విశేష వీర శైవము, నిరాభార వీర శైవము అను పదివిధములగు అవాంతరభేదములు శివాగమములలో వివరింపబడి, యివి యుత్తరోత్తరముగ ఉత్తమ ఫలదాయకములని చెప్పబడినది. వీనిలో నొకటి మొదట వెలసె ననియు, తక్కినవి దానినుండి పుట్టినవనియు చెప్పుట కాధారము లేదు. ఇవి ప్రాచీనకాలములో ఆయా యాచార్యులచే వేర్వేఱు ప్రదేశములందు వెలయింపబడి, కొన్ని రాను రాను ప్రచారము లేమిచే నశింపగా, మఱికొన్ని యితర యవాంతరభేదములలో లీనమయియుండవచ్చును.

శివశబ్దమువలెనే "లింగ" శబ్దముకూడ- (లీన మర్థంగమయతి- అనగా సమస్త ప్రపంచము దేనియం దుదయించి మరల దేనియందు లయమొందుచున్నదో యది యను విశాలార్థముతో) పరబ్రహ్మవాచకముగా వ్యవహృతమయినది. సూర్యునందలి తేజమువలెను, చంద్రునందలి వెన్నెలవలెను

ఇచ్ఛాజ్ఞానక్రియాత్మకమగు నొక మహాశక్తి యవినాభావముగ అనగా ఎంతమాత్రము వేఱుగా విడదీయరానివిధముగా పరబ్రహ్మ మగు శివునియందు గర్భిత మయియున్న దనియు, ఇట్టి శక్తితోగూడి ప్రేరితు డయిన యా శివుడే సమస్త జగత్తుయొక్క సృష్టిస్థితిలయములకు కారకు డగుచున్నా డనియు, ఆతనినుండి యుదయించిన జగత్తుకూడ నాతనివలె యథార్థమే గాని మిథ్యకానేర దనియు శివాగమము లందలి సిద్ధాంత మయియున్నది. "శివ శ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం। న చే దేవం దేవః న ఖలు కుశలః స్పందితు మపి" అని శంకరాచార్యులు సౌందర్య లహరిలో దేవిని స్తుతించియున్నారు. కావున శివశక్తులే జగజ్జనకులు. కాళిదాస మహాకవికూడ రఘువంశ ప్రథమశ్లోకమందు- శబ్దార్థములవలె కలిసియున్న పార్వతీపరమేశ్వరులే జగత్పిత లను విషయమును విశద మొనరించినాడు. శక్తిసమేతు డయిన శివుని (పరబ్రహ్మము) ఆరాధనమును శైవులు కరచరణాది రూపరహిత మయిన స్థావరలింగరూపమున దేవాలయము లందు చేయుచున్నారు; వీరశైవులు ఇష్టప్రాణభావ లింగ రూపకముగ నిజదేహాత్మక దేవాలయములందు చేయుచున్నారు. లింగచిహ్నములో పయినుండు లింగము శివాత్మక మనియు, దాని నావరించియుండు పానవట్టము శక్త్యాత్మక మనియు చెప్పబడుటచే, లింగము శివశక్తు లిరువురకు గూడ ద్యోతకమగు చిహ్నమనియే భావింపదగును.

## లింగధారణము

వీరశైవమునకు ప్రధానాంగము ఇష్టలింగధారణము, తత్పూజనము నయియున్నది. గురుడు హస్తమస్తక సంయోగ మొనర్చి దీక్షాకాలమున జీవుని నంటియుండు ఆణవ, కార్మిక, మాయా మలములు మూడింటిని వేధా, మను, క్రియాత్మక మయిన దీక్షాత్రయముచే దగ్ధము గావించును. ఆవిధముగా గురువర్యుడు భక్తుని భౌతిక శరీరమును లింగ శరీరముగా మార్చి, ఇష్టలింగమును ప్రసాదించును. ఈ యిష్టలింగమును వీరశైవుడు సర్వకాల సర్వావస్థలయందు, ఎప్పుడు నించుకేనియు నెడబాయక, తన స్థూలశరీరమున (శిరము, కంఠము, భుజము, వక్షము, కక్ష మున్నగుచోట) ధరించి, సూక్ష్మకారణశరీరముల నిక్షిప్తములయిన ప్రాణలింగ, భావలింగములతో దానికి ఐక్యానుసంధానము నలవరించుకొనుచు, పూజించుచుండవలెను. ఇష్టముల నొడగూర్చి యనిష్టముల పరిహరించునది యిష్టలింగము. కావున ఏకేశ్వరోపాసనాత్మక మయిన ఇష్టలింగారాధనము తప్ప మఱి యే యితర దేవతా పూజాకర్మములను వీరశైవు లాచరింపరాదు. దేవాలయము లందలి స్థావర లింగపూజనములతో గూడ వారి కేమాత్రము నిమిత్తము లేదు. శివజీవైక్య రూపకమయిన మోక్ష మొక్కటియే వారి ప్రధాన లక్ష్యము.

"విశబ్దే నోచ్యతే విద్యా శివజీవైక్య బోధినీ। తస్యాం రమంతే యే శైవాః వీరశైవా ఇతి స్మృతాః", "విశేషం

రాతీతి వీరః" ఇత్యాదిగా వీరశబ్దము నిర్వచింపబడినది. కావున నే వీరవ్రతము కులాంగనాసదృశ మనియు, బహుదేవతారాధనరూపకములగు నితరవ్రతవిధానములు గణికాంగనాసదృశములనియు "ఏకేన జన్మనా ముక్తిర్వీరాణాం తు మహేశ్వరి" (వీరవ్రతులకు ఒక్క జన్మముననే ముక్తి లభించును) అనియు శివాగమములలో చెప్పబడినది.

## పంచాచారములు

వీరశైవులకు లింగాచార, సదాచార, శివాచార, భృత్యాచార, గణాచారము లని పంచాచారములు విహితములై యున్నవి. సమాజమునందు ఉత్తమరీతిని నడుచుకొనుటకు పంచాచారములు తోడ్పడును. లింగాచార మనగా శివుడే యేకైక దైవమని నమ్మి లింగపూజానిష్ఠుడై యుండుట. సదాచార మనగా నేదో యొకవృత్తి నవలంబించి, పరవనితావిత్తముల గోరక, నిజాయితీతో ద్రవ్యార్జన చేసి, తనకుటుంబమును పోషించుకొనుటయేకాక జంగములను ఇతరులనుకూడ అన్నవస్త్రముల నిచ్చి ఆదుకొనుట. శివాచార మనగా శివభక్తు లందఱు నొకటే యని యెంచి, వారేయే వృత్తు లవలంబించినను గణించక, వారందఱితో భోజనవివాహాది సంబంధములను గలిగియుండుట. భృత్యాచార మనగా శివునకు, శివభక్తు లందఱికి తాను భృత్యుడ నని నమ్రతతో మెలగుట. గణాచార మనగా శివనింద చేయువారిని, మనుజులయెడ జంతువులయెడ క్రూరముగా ప్రవర్తించువారిని దండించుట, -

## అష్టావరణములు

అష్టావరణము లనబడు ఎనిమిది ఆవరణముల కోటలో నున్న శివభక్తునికి కామ క్రోధ లోభాద్యరివర్గమునుండియు, అజ్ఞానము నుండియు తగు రక్షణ లభించుటయేకాక, అతనికి భక్తి, జ్ఞాన వైరాగ్యములు చేకూరి, శివానుభవము పొందుమార్గము సుగమమగును. అవి గురు, లింగ, జంగము, పాదోదక, ప్రసాద, భస్మ, రుద్రాక్ష, మంత్రము లైయున్నవి. గురువు లౌకికాధ్యాత్మిక జ్ఞానసంపన్నుడైయుండి, శిష్యునకు శివదీక్ష నొసంగి, మంత్రయుక్తముగా శివలింగమును ప్రసాదించవలయును. మతసూత్రములగురించియు, మతాచారముల గురించియు వాని అంతరార్థముల గురించియు శిష్యునకు బోధించి, శివానుభవ సాధనాపథములో నతనిని సక్రమముగా నడిపింపవలయును. గురుడు చెప్పిన చొప్పున నాచరించి, శిష్యుడు విశేషలాభము బడయగలడు. కావుననే గురువున కష్టావరణములలో ప్రథమస్థాన మొసగబడినది.

లింగము మతపరమైన ఆచారములకు పూజలకు కేంద్రస్థానమై, ఆధారభూతమై వెలయుచున్నది. జంగమము అనగా కదలునది యని శబ్దార్థము. అది యొకవ్యక్తికి అన్వయించినపుడు జంగమ లింగము లేక చరలింగము అనగా దేశసంచారము చేయుచు, శిష్యులకు మతబోధన చేయువాడని యర్థము. ఆతడు శివయోగియై, జీవన్ముక్తుడై, శిష్యు

లకు మోక్షసాధనలు ఉపదేశించు అధికారము గలవారై యుండవలెను. నిరాకారమైన పరశివ బ్రహ్మము లోక కళ్యాణమునకై గురు-లింగ-జంగమ రూపమున వ్యక్తమ య్యెనని వీరశైవుల విశ్వాసము. ఈమూడింటిని వీరశైవులు సమానభావముతో చూచి, వీనియెడ సమానభక్తి ప్రపత్తులు చూపవలసియున్నది.

పాదోదక, ప్రసాదములనగా గురువు లేక జంగమము యొక్క స్పర్శ, దృష్టి, లేక సంకల్పముచే పునీతము గావింప బడిన జలము, ఆహారమునై యున్నవి. వీటికి సాంఘికప్రయో జనముకూడ గలదు. గురుజంగమముల సమక్షమున వీర శైవులు జాతి, వయో, లింగభేదములు లేక సర్వులును ఒకే తీర్థప్రసాదములు స్వీకరించి తద్ద్వారా సోదరభావమును పెంపొందించుకొనుట కవకాశ మేర్పడుచున్నది తీర్థప్రసాద ములు ఇహాపరసుఖములకు మూలకారణములై వెలయు చున్నవి.

భస్మరుద్రాక్షలను శివలాంఛనములధారణ జీవున కంటియున్న ఆణవ, మాయా, కార్మికములను మలత్రయ మును నాశనమొనరించును. భస్మరుద్రాక్ష ధారణవలన భక్తుని దృష్టిలో మార్పుసంభవించి, యతడు ప్రతిపనిలోను ప్రతివస్తువులోను పరతత్త్వము నీక్షించు విలక్షణశక్తిని పొం దగల్గును. ఇక మంత్రమనగా "నమశ్శివాయ" యను పం చాక్షరీ మంత్రము. ఈ మంత్రజపము శివకారుణ్యమును

సంపాదించు ముఖ్యసాధనము; అంతమందు జీవాత్మకు మోక్షలాభమును జేకూర్చునట్టిది.

ఈ అష్టావరణములను ఎనిమిది రక్షణాలు భక్తునికి శారీరకమానసిక పవిత్రతను కలుగజేసి మాయాజాలమునుండి అతనికి విముక్తి ప్రసాదించును. అందువలననే వీరశైవులు శివయోగి లేక శివశరణులుగా పరిగణింపబడుచున్నారు. సదా దేహమందు ధరించిన లింగమను జ్యోతిచే అతని మలినములన్నియు దహింపబడుటవలన, మరణించిన తర్వాత మరల దహన సంస్కార మతనికిలేదు; ఖననమే విధింపబడినది. మరియు పంచసూతకములుగూడ లేవు.

## షట్ స్థలములు

వీరశైవులకు పరమలక్ష్యమయిన శివజీవైక్యసిద్ధినందుటకై, తత్సాధన సోపానముగ భక్త, మాహేశ్వర, ప్రసాది, ప్రాణలింగి, శరణ, ఐక్యములను షట్స్థలములేర్పఱుపబడినవి. కావున షట్స్థలవిధాన విజ్ఞానములు వీరశైవుల కావశ్యకములయి యున్నవి. స్థల మనగా సామాన్యార్థమయిన చోటు అని కాక జీవాత్మ పరమాత్మను చేరుటకు చేయు ప్రయాణములో నొకదశ, సోపానము, లేక మజిలీ అను నర్థములో నిచటప్రయోగింపబడినది. సిద్ధాంత శిఖామణియను సంస్కృత గ్రంథమున నిందుగూర్చి విశేషవివరములు చెప్పబడియున్నవి. (1) సాధకుడు ఆత్మార్పణమొనర్చి

తను మనోధనముల యందు తగులములు మాని యవి నిజగురునకు, శివభక్తులకు అధీనములని తలంచు బుద్ధిని హెచ్చరించునది భక్తస్థలము. (2) "ఆత్మవత్సర్వభూతాని" అను న్యాయముతో సమస్త జీవరాసులను తనవలెనే భావించి, ఫలాపేక్ష రహితముగ కర్మలొనర్పదగు ఆవశ్యకతను హెచ్చరించునది మాహేశ్వరస్థలము. (3) సమస్తపదార్థములను ముందు శివార్పణమొనరించి, శివప్రసాదబుద్ధితో వానిని గ్రహించుచు, తానొనర్చు కర్మములన్నిటికి శివుడే కర్తయనియు, ఆతని ప్రేరణములేనిదే తాను చేయునది లేదనియు, తలంచెడి శివాధీనతను హెచ్చరించునది ప్రసాదిస్థలము. (4) తన ప్రాణము శివుని శక్తియే యని భావించి, మనస్సును ప్రాణలింగమందే లగ్నమొనరించుటను హెచ్చరించునది ప్రాణలింగిస్థలము. ఈ స్థితిలో సాధకునకు శివయోగము (శివునితో కూడిక) చేకూరును. (5) శివుడు పతియని, తాను సతినని, ఆతడు తక్క వేఱు శరణములేదని యనన్యమగు సతీభావముతోడ శివుని యెడవర్తిల్లుస్థితిని హెచ్చరించునది శరణస్థలము. (6) పూర్వోక్తములయిన పంచస్థల లక్షణములలో గడిదేరినంతనే సాధకునకు సమస్తము (తనతోసహితము) శివస్వరూపముగానే గోచరించునుగాని ఇంచుకేని భిన్నస్థితి మఱియు గాన్పింపదు. హారతియిచ్చిన కర్పూరమువలె సర్వదగ్ధమయి స్వస్వరూపమునశించి శివైక్యముగలుగును. ఈ దశను వివరించునదే ఐక్యస్థలము.

కావున క్రమసాధనవలన వీరశైవుడు శివైక్యస్థితిని సాధింపవలసియున్నది. వీరశైవదీక్షితులకు భౌతిక శరీరము లింగశరీరముగా మాఱుననియు న్నే చెప్పబడినది. కావున నిరంతరము మనస్సును, బుద్ధిని, ఇష్టప్రాణభావలింగముల యందే నిలిపి ధ్యానించుచు, నిష్కామ బుద్ధితో తనకృత్య ములనన్నింటిని లింగమునకే యర్పించి, తమ కర్మేంద్రియ జ్ఞానేంద్రియములు లింగాధిష్ఠితములని భావించుచు, వారు తమ వ్యాపారములన్నియు లింగార్పిత మొనర్పవలసి యున్నది. ఇట్టి సాధనచే చిత్తము చెడ్డపనులమీదికిపోక, శివునియందే హత్తియుండును. అందుచే నట్టివారికి పునర్జ న్మములేక, శివజీవైక్యరూపకమయిన మోక్షము కరతలా మలకమగును.

వీరశైవములో మతపరమైన బాధ్యతలు, అధికార ములు స్త్రీ పురుషు లిరువురికి ఎట్టిహెచ్చు తగ్గులును లేక సమానముగా నుండుట విశేషము.

వీరశైవసిద్ధాంతమునకు ద్వైతాద్వైతము, భేదాభేద సిద్ధాంతము, శక్తివిశిష్టాద్వైతము అను నామములుకూడ నున్నట్లు ముందే చెప్పియుంటిని.

## భేదాఽభేదసిద్ధాంతము

వీరశైవసిద్ధాంతములో శివునకు జీవునకు పారమార్థిక మగు భేదాఽభేదమంగీకృతమయినది. అగ్నినుండియుద్భవిం చిన యగ్నికణములకు అగ్నికి అత్యంతమయిన భేదమును

గాని యత్యంతమయిన అభేదమునుగాని చెప్పరానివిధము
న నే, శివునినుండి యుత్పన్నమయి శివాంశములుగ గణింప
బడు జీవులకు శివునకుఁ గూడ అత్యంతమయిన భేదమును
గాని అత్యంతమయిన అభేదమునుగాని చెప్పవలనుపడదు.
అందుచేత భేదాఽభేదమును మాత్రమే చెప్పవలసియున్నది.
అగ్నికి, అగ్నికణమునకు అత్యంతమయిన అభేదమునుచెప్పు
నెడల, అగ్నిచే జరుగు పాకాదిక్రియలు (వంట మొదలగు
పనులు) అగ్నికణమాత్రమువలనగూడ నెఱవేరవలయును
గదా! అట్లు జరుగకుండుట అందఱెఱిగినదే. అత్యంతమ
యిన భేదమునే చెప్పెడిచో అగ్నికంటెభిన్నములైనవస్తువు
లందు గనరాని దహనశక్తి అగ్నికణమందును లేదనిచెప్ప
నగును. కాని యట్లుచెప్పగలమా! నలుసంత నిప్పు దూది
రాశిమీద పడినచో దానిని దహించి పెద్దమంటయగును
గదా! ఇట్లే శివునకు తదంశజనితులైన జీవులకు అత్యంత
మయిన అభేదము చెప్పెడిచో శివునియందున్న సర్వజ్ఞత్వ
సర్వకర్తృత్వ శక్తులు జీవులకుగూడగలవని చెప్పవలసి
వచ్చును. అత్యంతమయిన భేదము చెప్పెడిచో శివునికంటె
భిన్నములయిన ఘటపటాదులకులేని జ్ఞానరూపక్రియలు
జీవులకుగూడలేవని చెప్పనగును. జీవులకు వస్తుజ్ఞానముగలదని
యెల్లరెఱిగినదే. కావున వీరశైవాచార్యులు శివునకు జీవునకు
భేదాఽభేదమును (కొంతవఱకు భేదము మఱికొంతవఱకు
అభేదము) అంగీకరించిరి. ఇందుచేతనే వీరశైవమతమునకు

భేదాఽభేదసిద్ధాంతము, ద్వైతాఽద్వైతసిద్ధాంతము అను నామాంతరములు కలిగినవి.

శక్తి విశిష్టాద్వైతము

మఱియు వీరశైవ సిద్ధాంతము నందు శివునకు శక్తికి అవినాభావసంబంధము (సమవాయసంబంధము) చెప్పబడినది. విడదీయరాని నిత్యసంబంధమే సమవాయ సంబంధమని గణింపబడును. శక్తివిశిష్టబ్రహ్మమునుండి యుత్పన్నమవుటచే జగత్తుకూడ శక్తివిశిష్టమే యగుచున్నది. ప్రపంచమందలి యేపదార్థమును జూచినను దానిలో నొకవిధమైనశక్తి యుండుట మనము కనులారగాంచుచున్నాము పృథివియందు ధారణశక్తి, జలమునందు ఆప్యాయనశక్తి, తేజస్సునందు ఉజ్జ్వలనశక్తి, వాయువునందు స్పందనశక్తి, ఆకాశమునందు వ్యాపనశక్తి, ఆత్మయందు బుద్ధశక్తి, వృక్షాదులందు జలాకర్షణశక్తి, అగ్నియందుదహనశక్తి, ఓషధులయందు రోగనివారణశక్తి, ఇత్యాదిగా సృష్టియందలి సమస్తపదార్థములందు ఒక్కొక్క విధమయినశక్తి సహజముగాగలదు. ఈ శక్తి విశిష్టమయిన జగమును నిర్మించిన బ్రహ్మము అర్థతః శక్తివిశిష్టమయిన దేయని అందఱకును అనుభవసిద్ధముగ విదితముగాకమానదు. పరశివబ్రహ్మము స్వాభావికముగానే శక్తితో విశిష్టుడయి (కూడి) యున్నాడు. పరశివబ్రహ్మమునందిట్లు వేర్పఱుపరాని విధముగా విశిష్టమయి యుండుటచే ఈ శక్తి నిత్యము, శాశ్వతము నయినదని గణింపవలెను. శివాంశజనితుడైన జీవుడునుగూడ శక్తివిశిష్టుడే.

శక్తివిశిష్టాద్వైత మనగా శక్తివిశిష్టుడయిన జీవునకు శక్తివిశిష్టుడయిన శివునకు ఇరువురకు సామరస్యమనియర్థము.

"శక్తిశ్చశక్తిశ్చశక్తీ తాభ్యాంవిశిష్టౌ
జీవేశౌతయోః అద్వైతంశక్తివిశిష్టాద్వైతమ్ ॥

అని పూర్వాచార్యులు శక్తివిశిష్టాద్వైతపదమునకు వ్యుత్పత్తిని చెప్పియున్నారు. శక్తి యనునది స్థూలచిదచిదాత్మకశక్తి, సూక్ష్మచిదచిదాత్మకశక్తియని రెండువిధములు. జీవుడు స్థూలచిదచిదాత్మకశక్తితో గూడియున్నాడు. శివుడు సూక్ష్మచిదచిదాత్మకశక్తితో గూడియున్నాడు. జీవునిస్థూల చిచ్ఛక్తి కించిద్జ్ఞత్వ (స్వల్పజ్ఞానముగలది) రూపకమయినది; స్థూలఅచిచ్ఛక్తి కించిత్ కర్తృత్వ (స్వల్పముచేయగల్గునది) రూపకమయినది. శివుని సూక్ష్మచిచ్ఛక్తి సర్వజ్ఞతా (సమస్త మెఱుంగుట) రూపకమయినది. సూక్ష్మఅచిచ్ఛక్తి సర్వకర్తృతా (సమస్తముచేయగల్గుట) రూపకమయినది. ఇట్లు క్రమముగ రెండువిధములయిన శక్తులు గలిగియుండు జీవునకు, శివునకుగల అద్వైతమే (సామరస్యమే) శక్తివిశిష్టాద్వైతమని చెప్పబడుచున్నది. లింగాంగియైన వీరశైవుడు షట్స్థలాచరణమున నీటియందునీరు, అగ్నియందగ్ని కలిసి యేకమయినవిధముగా పరశివబ్రహ్మమునందు సమరసత్వ మొంది యేకాకృతిని జెందును. శుద్ధాత్ముడయిన అంగనామకజీవుడు, లింగనామక శివునియందు సామరస్యమొందుటచే ఇదియే లింగాంగసామరస్యమని, శివజీవైక్యమని, శక్తివిశిష్టాద్వైతమని వ్యవహృతమయినది.

# 2. బసవేశ్వరుని జననము

ఉ॥ మండగెవంశభూషణుడు, మాదయ, తత్సతిమాదమాంబ బ్ర
హ్మాండప్రకీర్ణగీతయశ, నంబుజలోచనముఖ్యదేవతా
మండలసేవ్యకీర్తిగుణమండితు, శ్రీ బసవేశ్వరాఖ్యు, నే
దండితపంబుమైగనిరొ ధన్యతగాంచి నిజైకపుత్రుగాన్ ॥

[బండారు తమ్మయ్య]

పార్వతీపరమేశ్వరులు కైలాసనగమందు కొలువుదీరియున్న సమయమున నారదమహర్షి వీణాపాణియై యేతెంచి వారిని స్తుతించి, సకలలోకవార్తలను నివేదించి, భూలోకమందు శివభక్తి క్షీణించుచున్నదని విన్నపముచేసి, శివధర్మోద్ధరణకై శివుడే పూనుకొనవలయునని ప్రార్థించెను. అప్పుడు దేవదేవుడగు మహేశ్వరుడు ఆ నందీశ్వరునకును నాకును అభేదమగుటచే నాతనిని శైవధర్మోద్ధరణకై భూతలమునకు పంపెదనని సెలవిచ్చెను. మఱియు నీసందర్భమున శంకరుడు గౌరికి నందికేశ్వరువృత్తాంతము నిట్లు తెలియజెప్పెను —
"దేవీ! మున్ను శిలాదుడను మునిశ్రేష్ఠుడు నన్నుగూర్చి తపంబొనర్చి, నందికేశ్వరుని పుత్రునిగా బడయు వరమును పొందెను. అటుపిమ్మట, శిలాదసుతుడయి జన్మించిన నందికేశ్వరుడుకూడ ఘోరమైన తపస్సుజేసి, నన్ను సాక్షాత్కరింపజేసికొనగా, నేనతనిని వరమేమి కావలెనో కోరుకొమ్మంటిని. ఆతడు సదమలశివభక్తి యొక్కటి తక్క తనకిట్టి పదవులు గిదవులు వలదని విన్నవించెను. అందులకు మెచ్చి నేనాతనిని ప్రమథేంద్రపదవికి పట్టముగట్టి, సర్వజ్ఞ

త్వమును ప్రసాదించి, నాటంగోలె నావాహనముగా జేసి కొంటిని ఆ నంది కేశ్వరునకు నాకు నొక్కింతయు భేదము లేదు. ఆతడు ద్వితీయశంభుడేసుమా!" ఈప్రకారము శివుడానతిచ్చి నందికేశ్వరుని బిలిపించి మర్త్యలోకమందు బసవేశ్వరుడుగా జన్మించి, శివభక్తినుద్ధరించి, లోకహితార్థము, భక్తహితార్థము గావింపవలెనని ఆదేశించెను. ఇది బసవపురాణములోనున్న వృత్తాంతము.

కర్ణాటక దేశమందు బీజపూరు జిల్లాలోని హింగుళేశ్వర అగ్రహారమునకు సమీపమున బాగెవాడి యను గ్రామము కలదు. ఈగ్రామమే బసవేశ్వరుని జన్మస్థలమయినట్లు సాహిత్యగ్రంథములద్వారా శాసనములద్వారా నిరూపితమయినది. వాడుకలో నేటికిని అది బసవనబాగెవాడి యని పిలువబడుచున్నది. నేడది యొక తాలూకాకు స్థానమై యలరారుచున్నది.

ఈ గ్రామములో మండగి మాదిరాజు, మాదమాంబ యను శైవబ్రాహ్మణ దంపతులు కాపురముండిరి. మాదమాంబ పుత్రసంతాన మపేక్షించి, నందికేశ్వరు నోమును సోమవారమాదిగా తొమ్మిది దినములు నోచి, మఱునాడు నందిని పుష్పాక్షతధూపదీపాదులతో పూజించి, మహానైవేద్య మర్పించి — నీయట్టి సద్భక్తు నీయట్టి పుత్రునొక్కని కరుణింపవయ్య యని వేడుకొనగా, నామెకంత నెలతప్పెను.

కాని అదేమి మాయయో కాని తొమ్మిదిమాసములకు కానుపు రాలేదు. పదాకేసలు శ్రమతో గర్భమునుమోసి, చివరకామె బాలార్కకోటులప్రభలు గిడ్పుచు నొక బాలకుని ప్రసవించెను. ఆ సమయమునందు కప్పడి సంగమేశ్వరుడేతెంచి యెవరికి తెలియకుండ శిశువునకు శివలింగధారణ మొనర్చి, మునివేషమున మాదమాంబకు ప్రత్యక్షమై, ఈ శిశువునకు శివలింగార్పితము కాని పదార్థమేదియు తినబెట్ట గూడదనియు, తననివాస స్థానము సంగమేశ్వరస్థానమనియు చెప్పి యదృశ్యుడాయెను ఇట్లు బసవపురాణమునం దుల్లేఖింపబడి యుండగా సింగిరాజ పురాణమం దిట్లున్నది. పుట్టిన శిశువు రోదనచేయక, కనులు తెరువక, స్తబ్ధముగా నుండుటజూచి మాదిరాజు భక్తోద్ధరణకై బాగెవాడి విచ్చేసి యున్న సంగమక్షేత్రాధిపతియగు జాతవేదమునిని తన గృహంబునకు రావించగా, నామునిచంద్రుడు శిశువునకు శివలింగమును ప్రసాదించి, శివపంచాక్షర మంత్రమును చెవిలోజెప్పి, ఫాలమున భస్మముధరింప జేసెను. అంతనందఱు నానందము నొందఁ బాలకుడు కనులువిప్పి చూచెను. శిశువునకు లింగార్పితముకాని పదార్థము కుడువబెట్టగూడదనియు అన్యదైవములకు సమర్పించిన వానిని ఈతని శివలింగమున కర్పింపగూడదనియు గట్టిడిచేసి ముని యేగెను. హరిహరకవి కప్పుడీ సంగమక్షేత్రాధిపతియగు స్వామిని జాతవేదిమును పర్యాయనామముగల ఈశాన్యగురువుగా పేర్కొని

యున్నాడు. కప్పుడి సంగమేశ్వరుడును, జాతవేదమునివర్యుడును, ఈశాన్యగురువర్యుడును నొక్క వ్యక్తియే కాదగునని "లోకారాధ్య బసవేశ్వర" డను గ్రంథమున జెప్పబడియున్నది. ఆపిదప తలిదండ్రులు తమపుత్రునకు బసవేశ్వరుడని నామకరణ మొనర్చిరి. బసవేశ్వరుని జననము క్రీ. శ. 1105 సం॥లో జరిగినట్లు చరిత్రకారులు నిర్ణయించియున్నారు.

బాల బసవేశ్వరుని లీలాచేష్టితము లిట్లు బసవపురాణమున నభివర్ణింపబడినవి: వెనుక చీకటియుండ తనకేటి తేజమనునట్లు దీపంబు గనుగొని నవ్వును. లింగప్రసాదమగున్నదై యున్న గిలిచన్నుగుడువక న్లే యుండును. శివసుఖామృతమును చవిజూచుమాడ్కి చేతివ్రేళ్ళను నోట పెట్టుకొనును. సంసారము నవలబాఱవైచియాడెడురీతి చేతులాడించును. మాయాప్రపంచమును దూరముగా తన్నివేయు మాదిరి పాదములాడించును. తానువచ్చినపని తడవాయెనని యులికిపడును. శివకీర్తనలు విని యానందాశ్రువులు రాల్చినట్లేడ్చును. ఒడయలయడుగుల బడినవడువున బోరగిలబడును. నిర్మలశివభక్తి తలయెత్తినట్లు తాను తలయెత్తును. పద్మాసనమభ్యసించువానివలె గూర్చుండును. ద్వితీయశంభుడగు నంది నే నేనను పోల్కి నేలపై దోగియాడును. వీరమాహేశ్వరాచారమంతయు ప్రోవైనిల్చిన భాతి నిల్చుండును. ఆదిమార్గము తప్పకుండ నడుగిడులీల తప్పటడుగులు వేయును. శివనామము విన్నంతగాద్గద్యమొదవుభంగి తొక్కుపలుకుల

ణము జరుగగా ఈప్రయత్న మెందుకుచేసిరను ప్రశ్న ఉద యింపవచ్చును. సింగిరాజపురాణములో శిశువునకు లింగధా రణ మెవ్వరికి తెలియకుండ జేయబడినదని పేర్కొనబడు టచే, మాదిరాజునకా సంగతి తెలియక ఉపనయన సం స్కారప్రయత్న మొనరించి యుండవచ్చును. జాతవేదముని బసవేశ్వర జనన సమయమందు ననుగ్రహించిన లింగమును బాలబసవేశ్వరుడు దేహమందు ధరించియుండ నందువలన నేమో ఉపనయనప్రయత్నము జరిగినది. ఈ ఉపనయన మును నిరాకరించుచు బసవేశ్వరుడు తండ్రితో వాదించినట్లు బసవపురాణమందు ల్లేఖింపబడియున్నది. పీరమాం పీ·శ్వరా చారదీక్షితుడను — సిర్మితోభయకర్మ నిర్మాలుడను — నన్ను కర్మాబ్ధిముంచుట నీకు ధర్మమా? కర్మ పాశంబులు త్రెంచివైచి మరల కర్మంబు త్రాళ్లు తాగట్టుకోదగునా? జాతిగోత్రాతీతుని జాతి గోత్రక్రియాశ్రయు జేసెదవా? యని ఇత్యాదిగా బసవన్న తండ్రితో వాదనజేసి ఉపనయనమును తిరస్కరించినాడు. సింగిరాజకవియు, హరిహరకవియుగూడ దమకృతులలో బసవేశ్వరుడు యజ్ఞోపవీతసంస్కారమును తిరస్కరించెననియే వ్రాసియున్నారు.

ధారవాడ విశ్వవిద్యాలయ చరిత్రశాఖాధ్యక్షులు శ్రీ పి. బి. దేశాయిగారి పరిశోధన గ్రంథములో బసవనికి గర్భాష్టకమున సంప్రదాయము ప్రకారము ఉపనయనము జరిగినట్లును, కొంతకాలమంతడు జన్నిదముధరించి, గాయ

త్రిని జపించినట్లును నిర్ధారింపబడినది. కాని ఆయజ్ఞోపవీతము గాయత్రీ మంత్రము మఱియు వానిని ప్రసాదించిన బ్రాహ్మణమతము భగవదన్వేషణాశీలుడగు మన చిఱుత ప్రాయపు బసవేశ్వరునికి తగినంత జ్ఞానాభివృద్ధిని గలిగింపలేకపోయినవి. అవి కేవలము యాంత్రికములగు ఆచారములుగా నున్నందువలనను, అవి బోధించు గురువులుకూడ అధ్యాత్మజ్ఞాన సంపన్నులుకారు కావునను బసవేశ్వరునకు అవి నిరర్థకములుగాతోచి, పదునాఱేండ్ల ప్రాయమందే ఆతడు యజ్ఞోపవీతమును పరిత్యజించెనని శ్రీ పి. బి. దేశాయిగారు వ్రాసియున్నారు.

## 4. విద్యాసముపార్జనము శివదీక్ష

ఉపనయనమును తిరస్కరించి, తల్లిదండ్రులతో వివదించి బసవేశ్వరుడు తన సహోదరి యగు నాగాంబను తోడ్కొని స్వస్థానమగు బాగెవాడిని వదలి వెళ్ళిపోయినట్లు బసవపురాణమందున్నది. శ్రీ పి. బి. దేశాయిగారి గ్రంథములో ఉపనయనానంతరము కొలది కాలమునకే బసవన్న తల్లిదండ్రులు పరమపదించినట్లును, ఆతడు ముత్తవ్వపోషణములో కొంతకాల మచ్చటనే యుండినట్లును జెప్పబడినది. తన భగవదన్వేషణకు దోహదము కలిగించని కారణముచేనాతడంత యజ్ఞోపవీతమును, బ్రాహ్మణ మతమును, బాగవాడి పురమును వదలి, జ్ఞానసముపార్జనార్థము కూడలిసంగమేశ్వరస్థానమునకు పయనమై వెళ్ళెను. ఆదినములలో సంగ

మేశ్వరము శైవమతావలంబులకు పెట్టని కోటగా నలరారు చుండెను. అచ్చటి సంగమేశ్వరాలయమునకు దేశ దేశముల నుండి జంగమస్వాములు లేతెంచి తత్త్వవిచారములు, మత పరమైన గోష్ఠులుగావించుచుండిరి. అచ్చటనే తనకు జనన కాలమందు లింగప్రదానముచేసిన జాతవేదముని యుండెను. ఆ మునిని బసవేశ్వరుడు నిజగురువుగా, ఉపదేష్టగా, స్వీక రించి, ఆయన వలన శివదీక్షను బడసి, పూర్ణవీరశైవుడా యెను. పరమేశ్వర పరాధీనచిత్తుడగు మన బసవేశ్వరునికి బ్రహ్మవిద్య గఱచుటకు సంగమేశ్వరస్థాన మాదర్శస్థాన ముగా సర్వవిధముల తగియుండెను. ఇచ్చోట బసవేశ్వరుడు క్రీ. శ. 1121 నుండి 1132 వఱకు ద్వాదశవత్సరము లుండె నట్లు చరిత్రకారులు నిర్ణయించినారు. ఈ కాలములో బస వేశ్వరునకు సంస్కృతభాష నేర్చి, శాస్త్రములు చదివి, తగు పాండిత్య మార్జించుటకేకాక, స్వకీయముగా పరతత్త్వవిచా రము సలిపి గ్రంథోక్త సిద్ధాంతములను సాధనామార్గముల నన్వేషించి వాటికి నిర్దిష్టమైన రూపకల్పన జేయుటకుగూడ వీలు చిక్కెను. ఆతడు అధ్యాత్మ జ్ఞానములో నారితేరి, స్వయముగా సాధనచేసి అందు కృతకృత్యుడగుటయేకాక, లౌకికవిద్యలలోగూడ ప్రావీణ్యమునార్జించెను. సంగమేశ్వర మందు బసవేశ్వరునికి లభించిన విస్తృతవిద్యార్జనావకాశ ములగుఱించి ఆయనవచనాలలో పలుతావులందు పేర్కొన బడినది. ఇచ్చట బసవేశ్వరుడు వేదవేదాంగములు, దర్శన

ములు, పురాణాగమములు క్షుణ్ణముగా నేర్చినట్లు మనకు వచనములవల్ల విశదమగుచున్నది తన భవిష్యత్కార్య క్రమమున కాతడిచ్చోటనే ప్రణాళికలువేసికొనెనని చెప్ప వచ్చును.

## 5. ఆనాటి మతసాంఘికపరిస్థితులు

జీవన దివ్యగవ్యమును జేర్పఁగలేని విభిన్న సంప్రదా
యావిలమై సమాజము యథార్థపు భక్తి నశింప నంధకా
రావృతమైన వేళను శివాజ్ఞమెయి న్బ్రభవించి భక్తికిం
బ్రోవయి వీరశైవమతబోధల నిక్కువుబెట్టి చూపి సం
భావితుడైతనర్చు బసవప్రభునిత్యము సంస్మరించెదన్.

ఆనాడు కర్ణాట దేశములో పలు మతములు ప్రబలి యుండెను. బౌద్ధ జైన చార్వాకాది నాస్తిక ధర్మము లొక వంక, ఆచరణ శూన్యమగు సర్వాద్వైతమొకవంక, ఒక వైపు వైష్ణవము, ఇంకొకవైపు హరిహరభక్తి, వేఱొకవైపు సూర్యారాధన, ఇంకను శక్తిపూజలు గూడ ప్రజలలో వ్యాప్తియందుండెను. అన్నిటికన్న నెక్కువగా శైవము వ్యాప్తిలోనుండెను. బౌద్ధులకు శైవులకు వాదోపవాదములు జరుగుచుండెను. వీరశైవులగు ఏకాంతరామయ్య విరూపరసు అనువారలకును బౌద్ధులకును వాదప్రతివాదములు జరిగినట్లు అబ్లూరుతళ్ళికోట శాసనములవల్ల విదితమగుచున్నది. కళ్యాణచాళుక్యుల పతాక చిహ్నము విష్ణుమూర్తి అవతారమగు వరాహము. అయినను వారు విష్ణువునే కాక ఈశ్వరుని, ఇతర దైవములను గూడ నారాధించుచుండిరి. చాళుక్యభూపతి

ఆఱవ విక్రమాదిత్యుని రాణి జైనమతావలంబినియై భర్త అనుమతితో రాచనగరులోనే జినదేవుని పూజించుచుండెను.

శైవులలోగూడ పాశుపత లేక లకులీశ, కాలాముఖ, కాపాలికాది శాఖలుండెను. వీరు శివాగమములను ప్రమాణముగా స్వీకరించి శివుని — లింగ, చతుర్భుజేశ్వర, నటరాజ భైరవరూపములలో నర్చించుచుండిరి. కాపాలికులు భైరవ మూర్తిని గొలుచుచు, ఆమూర్తిని తృప్తిపఱచుటకు నింద్యములగు కర్మకాండలు చేయుచుండిరి. ఇతరులు శివాలయములందలి స్థావర లింగములను పూజించుచుండిరి.

నిరక్షరాస్యులు, నిమ్నజాతులు ఎక్కువగా క్షుద్ర దైవతములను గొలుచుచు జంతుబలులు గావించుచుండిరి. ప్రతిగ్రామమునకు, పట్టణమునకు, రహదారికి, నదికి, వాగునకు, చెరువునకు, శ్మశానమునకు ప్రత్యేక దేవత లుండిరి. పాములను, వృక్షములను, రాళ్లను, ఇంటిలోని పాత్రలను, చేటలను, జల్లెడలను కూడ ప్రజలు పూజించుచుండిరి. దీని వల్ల నిజమైన మతతత్త్వము మఱుగునపడి ప్రజలు వెడ దారులకు మళ్ళిరి. ఆదినుండియు నమలులోనున్న చతుర్వర్ణములు శతాధికవర్ణము లాయెను. అస్పృశ్యతా జాడ్యము సంఘమును పీడించుచుండెను. వర్ణములలో న్యూనాధిక్యతా భావములు ప్రజలమనస్సులను కలుషితమొనర్చెను. గుణము కంటె కులము ప్రధానముగా నుండెను. స్త్రీ పురుషులకు సంఘములో సమాన స్థానము లేదయ్యెను.

ఈ సంప్రదాయాలు ఈ మూఢవిశ్వాసాలు సామాన్య పరిశీలకునికి ఎట్టిగా తోచకపోవచ్చునుగాని వాస్తవమైన ఆంతరదృష్టికల వ్యక్తికి ఇవి ఘోరములుగా తోపక మానవు కదా! కతిపయవివేకవంతులను ఈ పరిస్థితులు కలవర పెట్టగా, వారు వాటిని చక్కబఱచుటకై తీవ్రముగా పాటు పడసాగిరి. 12 వ శతాబ్దములో ఉత్తర కర్ణాటకమందు వెల సిన ముప్వురు మహానుభావులు బౌద్ధ జైనమతముల ప్రతిఘ టించి, శైవమతపూర్వ ప్రాశస్త్యమును, శివపారమ్యమును ఉద్ధరించుటకు కృషి సలిపిరి.

1. ఏకాంతరామయ్య: ఈయన బ్రాహ్మణ దంపతు లకు జన్మించి, చిఱుతప్రాయమునందే శివయోగమును సిద్ధింపజేసికొనెను. ఇతడుజైనులకు పెట్టనికోటయగు అబ్లూ రులో బహిరంగముగా తనతలను తెగవ్రేసికొని, వారము రోజులతర్వాత దానిని పొంది, జినునిపై శివాధిక్యమును ప్రకటించెను. అంత జైనులు కొందఱు పారిపోవగా, మిగి లినవారు శైవమతావలంబులైరి. శివునిపై అనన్య భక్తిభా వము గలిగియున్న కతమున నీత డేకాంత రామయ్య యను బిరుదనామము వహించెను.

2. వియాపరసు: ఈయన మహామండలేశ్వరుడై ప్రగాఢశివభక్తికలితుడై వీరజైనేశ్వరాలయములో గణార్చ నకు ఎన్నియోదానములుచేసెను. తళ్ళికోటలోని శివగణ

ముల మఠములయొక్క పోషణార్థము కూడ దానము లొసగెర్చెను.

3. వీరగోగ్గిదేవుడు: ఇతడు ధారవాడ మండలమున నొక ప్రాంతమున కధిపతి. జైనుల ప్రతిఘటించి శివాధిక్యము స్థాపించుటకై తను మనోధనముల నర్పించిన మహా వ్యక్తి.

వీరి తర్వాత బసవేశ్వరుడు ఆనాటి మతమందును, సాంఘిక వ్యవస్థయందును మార్పు అవసరమని గుర్తించి, తదీయ సంస్కరణకై బ్రహ్మాండమగు ఉద్యమమును నడుపుటకై పూనుకొని యుగపురుషుడుగా వెలుగొందెను.

## 6. బిజ్జలు నాస్థానములో నుద్యోగము

సంగమేశ్వరములో బసవేశ్వరుడు గావించిన విద్యా సముపార్జన మాతనిని ఆత్మవిశ్వాసపరునిగా తీర్చిదిద్ది ఆతడు తలపెట్టిన మత సాంఘిక సంస్కరణ మహోద్యమముల నడిపింపగల శక్తిసామర్థ్యముల నాతనికి ప్రసాదించెను. అందుచేనాతడు తన జీవనగమ్యమగు భగవదైక్యమునకు నిరంతర కృషి సలుపుటకును, భక్తిహీనులై సాంఘికదురాచారములకు బలియై, అజ్ఞాన తిమిరమందల్లాడు సోదర ప్రజల కధ్యాత్మ జ్యోతిని వెల్గించి దారి జూపుటకునుగూడ కృతనిశ్చయు డాయెను.

బసవేశ్వరుడంత సంగమేశ్వరము వదలి, మంగళవాడ కేగి యచ్చట 1132 సం॥లో బిజ్జలప్రభు నాస్థానములో గణ

కునిగా ఉద్యోగస్వీకారము చేసెను. కాలచుర్య వంశస్థుడగు బిజ్జలుడు మంగళవాడలో మహామండలేశ్వరుడుగా 1130సం॥ నుండి పరిపాలించుచుండెను. నేడు మహారాష్ట్రములో పంఢరీపురము సమీపమునందున్న మంగళవేఢయే నాటి మంగళవాడ. బిజ్జలు నాస్థానములో బొక్కసమునకు అధికారిగా సిద్ధదండాధిపుడు అను మహనీయుడు పని చేయుచుండెను. అనతి కాలముననే తన అసమాన ప్రజ్ఞాపాటవములచే మన బసవన్న కోశాధికారి మన్ననలను బడసెను. తనకు పుత్రులు లేనందువలన బసవేశ్వరుని సత్ప్రవర్తన, సచ్ఛీలాదికముల కాతడు ముగ్ధుడై బసవన్నను తన యింటిలో [illegible] నుంచుకొని, పుత్రనిర్విశేషముగా వాత్సల్యమును జూపుచుండెను. అట్లుండ, కొలదికాలమునకు, సిద్ధదండాధిపుడు సిద్ధిని పొందెను. బసవేశ్వరుని చాకచక్యమును కార్యదక్షతను గమనించిన బిజ్జలుడు—బసవేశ్వరునే ముఖ్య కోశాధికారిగా సిద్ధదండాధిపునిస్థానే నియమించెను. ఈనియామకము 1.41 సం॥ ప్రాంతములో జరిగినదని చెప్పవచ్చును.*

---

*బిజ్జలుని రాజధాని నగరములో నొకశివాలయ ప్రాంగణమందు [illegible]లో నున్న శిలాశాసనముండెనట. అందలి విషయము తెలిసికొనవలెనను కుతూహలము మెండై బిజ్జలుడు పండితోత్తముల నెందఱిని రావించినను ప్రయోజనము లేకపోయెనట. ఆలిపిని చదువగలిగిన వారికి మంత్రిపదవి నిచ్చెదనని బిజ్జలుడు ప్రకటించెనట. కొందఱు మంత్రుల సూచనపై [illegible] బసవేశుని వసుమతీశుడు పిలిపింపగా, నాతడు శాసనమును [illegible] చదివి విషయమును వివరించెనట. పదికోట్ల ద్రవ్యనిధి ఆ [illegible] వెల్లడికాగా, బిజ్జలు డానిధిని తీయించి బసవేశ్వరు[illegible] ప్రతీతి శిలలలోకలదు.

ఆపిమ్మట బసవేశ్వరుడు గంగాదేవి మాయాదేవి యను నిరువురు శీలవతులగు కన్యలను పరిణయమాడెను. మాయాదేవికి నీలలోచనయను మఱియొక నామమున్నట్లు కొన్ని కృతులలోనున్నది. బసవని మేనమామయగు బలదేవ దండనాయకుని కొమరితయే గంగాంబ యని బసవ పురాణమందు కలదు. సిద్ధదండాధిపుని పుత్రికయే నీలాంబ లేక మాయాదేవియనియు నాతడు తనయావత్ సంపదతో పాటు తన యేకైక పుత్రికను బసవేశ్వరున కొసంగినట్లు సింగిరాజపురాణమున నున్నది. వివాహానంతరము బసవేశ్వరుడు సంగమేశ్వరమునకు జని నిజగురువును దర్శింపగా, గురువర్యు డీ ప్రకారము ఉపదేశ మొసగెను.

1. శివలాంఛనము కలవారిని శివునివలె భావించి గౌరవించుము. 2. నీకు శత్రువైనను లింగధారిని మిత్రునిగా సంభావింపుము. 3. పట్టిన నియమము విడువక యాచరింపుము. 4. భక్తుల కులము నెంచి హేళన చేయకుము. 5. శివభక్తుల నిందించువారిని దండించుము. 6. వేదోక్తభక్తి నాదరించుము. 7. భక్తితో ప్రసాదము స్వీకరింపుము. 8. పరదారధనముల నాశింపకుము. 9. పరుల నిందింపకుము. 10. గురులింగజంగమముల నీశుగా భావింపుము. గురులింగజంగమముల త్రివిధ ప్రసాదముల సమభావనతో స్వీకరింపుము. 11 భక్తులజూచిన లేచి నమస్కరింపుము.

ఆ పిదప మంగళవాడ కేతెంచి, అనుదినవర్ధమానైశ్వర్యుడగుచు, జనపతిరాజ్యంబు చక్కబెట్టుచు, దెసలెల్ల సత్కీర్తి నింపుచు, బసవేశ్వరుడు—

శివరాత్రి నిత్యంబు చెల్లించుబాస
శివభక్తులెల్లను శివుడను బాస
భక్తులయోగ్యులు పట్టనిబాస
భక్తుల కులమెత్తి పలుకనిబాస
వృద్ధుడైన నొక మరియాద గనిబాస
అడిగిన యర్థంబు గడపనిబాస
ఏమంతయైన వంచింపనిబాస
ఏమి వేడిన నడిగెడ కిచ్చుబాస
పలుకిట్ల నడవడి పాలించుబాస
తలపెట్టులట్టుల పలికెడుబాస
కలనైన శివునకు గెలుపీనిబాస
గెలుపు భక్తులకిచ్చి కీప్పడుబాస
పరదూషణకు జెవులానని బాస
హరగణానర్పితం బంటనిబాస
జంగమంబును ప్రాణలింగమన్ బాస
లింగవిమనుజుల వేడనిబాస
వేదోక్తభక్తి సంపాదించుబాస
ఆదిశివాచారమలరించుబాస

ఈ విధమగున బాస యొనర్చెను.

అంతగొంతకాలమునకు మారారిభక్తికి మండనంబైన, కుమారుండు బసవనమంత్రికి గంగాంబవలన కలిగెననియు, కూడలి సంగమేశ్వర ప్రసాదజనితుడవుటచే నాశిశు

వునకు సంగమేశ్వరుడని నామకరణ మొనర్చిరనియు ప్రభు లింగలీలలో నున్నది.

## 7 బిజ్జలుడు

బసవేశ్వరుడు జన్మించిన 1105 సం॥ నాటికి, కళ్యాణ చాళుక్య వంశమునకు చెందిన ఆరవ విక్రమాదిత్య చక్రవర్తి (1076-1127) కర్ణాటక దేశమును పరిపాలించుచుం డెను క్రీ. శ 973 సం॥ లో రాష్ట్రకూటులను సంపూర్ణముగా నిర్జించి, రెండవ తైలపుడు ఈ కల్యాణచాళుక్యరాజ వంశమునకు మూలపురుషుడాయెను. అప్పటి నుండియు ఈ రాజవంశము క్రమేణా శక్తివంతమై ఆరవ విక్రమాదిత్య ప్రభువునాటికి అత్యున్నతదశ నందుకొనెను. ఈయన తదుపరి సింహాసనమెక్కిన ప్రభువులు అంతసమర్థులుకారు. వారికాలములోనే వారిక్రింద సామంతరాజులుగా నుండిన కాలచుర్యులకు తమ ప్రభువులను కాదని యెదురు తిరిగి తలయెత్తుకొనుటకు చక్కని యవకాశము ఏర్పడినది.

కాలచుర్యులు అసలు కర్ణాటక దేశస్థులు కారు. ఉత్తరప్రాంతములనుండి వారు కొన్నితరములక్రితమే వచ్చి కర్ణాటక దేశములో స్థిరపడిపోయిరి. చాలకాలము వఱకు వారికి రాజ్యాధికారము లభ్యము కాలేదు. ప్రప్రథమముగా కళ్యాణచాళుక్యుల కాలమందే వారికి రాజ్యాధికారము లభించినది, చాళుక్యుల సామంతరాజులుగా నుండి, వారు

మంగళవాడను రాజధానిగా జేసికొని, తర్దవాడిమున్నగు సీమలను పరిపాలించుచుండిరి.

ఆఱవ విక్రమాదిత్యుని సమకాలికుడైన జోగమ (1080-1118) విశ్వాసపాత్రుడైన సామంతరాజుగానే వ్యవహరించెను. తరువాత వచ్చిన పెమ్మాడి భూపతి (1118-1130) ఆఱవవిక్రమాదిత్యుని కుమార్తె నాగలాంబను పరిణయమై తన స్థానమునకునూతనబలమునుచేకూర్చుకొనెను. నాగలాంబకు పుట్టిన యాతడే బిజ్జల భూపాలుడు. చాళుక్య చక్రవర్తుల కుటుంబముతో తనతల్లివైపునుండి బాంధవ్యము ఏర్పడి యుండుటచేత, బిజ్జలుడు మఱింత శక్తిమంతుడై, తుదకు స్వామిద్రోహము తలపెట్టునంతటి బలవంతుడగు టకు గూడ వీలుచిక్కెను

ఆఱవ విక్రమాదిత్యుని తర్వాత రాజైన సోమేశ్వరుని సార్వభౌమత్వమును బిజ్జలుని తండ్రి మన్నించక స్వతంత్రుడుగానే వ్యవహరించెను. 1130 సం॥ ప్రాంతములో పెమ్మాడి తర్వాత మహామండలేశ్వరుడైన బిజ్జలుడు తండ్రి వలెనే స్వతంత్ర రాజుగా పాలింపదొడగెను. తన రాజ్యము నింకను వృద్ధిచేసికొనుటకై సమయ మనుకూలించినపుడు చాళుక్య సింహాసనముపై దెబ్బతీయుటకే ఆతడు పన్నాగములు పన్నుచుండెను.

అట్టి బిజ్జలుని కొలువులో మొదట గణకునిగా ప్రవేశించిన బసవేశ్వరుడు తన కార్యదక్షతచే రాజును మెప్పించి

సిద్ధదండాధిపుని మరణానంతరము, ముఖ్యకోశాధికారిగా 1141 సం॥ ప్రాంతమున నియమితుడాయెనని ముందే చెప్పితిమి. ఆ కాలములో ఉన్నతపదవులలోనున్నవారికి దండనాథుడు, మహామంత్రి అను బిరుదనామము లొసంగుట పరిపాటిగా నుండెను. ఆ సంప్రదాయము ననుసరించియే బసవేశ్వరునకీ రెండు బిరుదనామములును లాంఛనప్రాయముగా సంక్రమించినవికాని, కోశాధికారి పదవియొక్కటే ఆయన నిక్కముగా నిర్వహించిన పదవి.

## 8. మంగళవాడలో బసవన్న మహాత్మ్యము

సీ॥ ఫాలాక్షుభక్తకల్పక మెవ్వఁడనిన వీఁ
డను జిహ్వకు నమృతమైనవాఁడు
భక్తిసీమంతినీ వరుఁడెవ్వఁడనిన వీఁ
డని చూపుటకు లక్ష్యమైనవాఁడు
అకలంక ధర్మరక్షకుఁ డెవ్వఁడనిన వీఁ
డనియెన్నుటకు నాయ్యఁడైనవాఁడు
సర్వజ్ఞమూర్తి నాఁజను నెవ్వఁడనిన వీఁ
డనుపల్కునకు టాధియైనవాఁడు

గీ॥ బిజ్జలక్ష్మాతలాధిపోద్వేలరాజ్య
రక్షణాదక్షుఁ డపరఫాలేక్షుఁడండు
భరత జనయిత్రి సల్పిన వ్రతముఫలము
ప్రథితగుణహారి మాదయబసవశౌరి.

శా॥ కోశాగారము కొల్లగొట్టి ధనముల్ కోకొల్లగాజంగమా
ధీశాగ్రమ్ముల వ్యయమ్ము జేయునితడంచీర్ష్యాళువుల్ జెప్పభూ
మీశుండాగ్రహమొందు నత్తఱిని లోటేమాత్రమున్ లేనియా
కోశంబెల్లను నప్పగింపవె దయాకూపార! నందీశ్వరా!

బసవేశ్వరుడు అనతికాలములో అత్యున్నత పదవికి నియమింపబడుటయు, బిజ్జలున కభిమానపాత్రుడగుటయు ఆస్థానములోని పలువురు రాజోద్యోగులకు కంటకప్రాయమాయెను. వారు బసవేశ్వరునెడ ఈర్ష్యాగ్రస్తులైరి. ఉన్నత పదవి నాక్రమించుటే కాక, బసవేశ్వరుడు తన మతపరమైన కృషిని అనగా వీరశైవమతవ్యాప్తిని తన యేకైకజీవనధ్యేయముగా నెంచి, నిర్విరామముగా కొనసాగించుచుండెను. ఇప్పుడు బసవన్నకు ఉన్నతాధికారమున్నది. ప్రత్యేకముగా ధనాదాయమున్నది. శివునిపై ఆయనకుగల భక్తిప్రపత్తులు మరింత విజృంభించినవి. తన సంపదయావత్తు నాతడు జంగములకు (దేశసంచారమొనరించు శివభక్తులకు) వినియోగించుచుండెను. వారి నాతడు శివస్వరూపులుగానే భావించి, సేవించి, పూజించి, ఆరగింపబెట్టుచుండెను. ఈ ఉద్యమము 1141 సం॥ నాటికి తీవ్రస్థాయి నందుకొనెను.

అంతట బసవేశ్వరునికీర్తి నలుదెసలను వ్యాపించెను. జంగమయ్యలు దూరప్రదేశములనుండి అసంఖ్యాకులుగా వచ్చి బసవన్న కందాలో విందులు గుడుచుచు నిలకడగా మంగళవాడలోనుండి పోవుచుండిరి. బసవేశ్వరుడు నిత్యము లక్షతొంబదియారువేల శివభక్తులకు గణార్చనము గావించుచుండెనట! ఇంతమందికి విందులు గుడువబెట్టుటకు ఈతనికి ధనమెట్లులభించెనా యను శంక పలువురికి కలిగెను. రాజుగారి ధనాగారపు బీగము చేతిలోనున్నదికదా! ఆ ధన

మును నిందులకై వినియోగించుచున్నాడేమోయను సను మానము గూడ గొందఱికి గలుగకపోలేదు. నిజానికి తానవ తారపురుషుడగుటచే ముట్టినది ముత్యము, పట్టినది బంగా రము కాదగు స్వశక్తిమహిమమువలననే యాతడు గణార్చన లొనర్చెను కాని, రాజద్రవ్య మెంతమాత్రము గ్రహించి యెఱుగడు

ఇదియే మంచి అదనుగా నెంచి అసూయాపరులైన యుద్యోగులు కొందఱు బిజ్జల రాజునకు ఫిర్యాదుచేసిరి. బిజ్జలు డంత క్రోధపరవశుడై, బొక్కసమును తెఱపించి, అందుగల ద్రొక్కము నంతయు లెక్కవేయింపగా, అణాలుపైసలుతోసహా పూర్తిగా సరిపోయెను. దీనితో బసవేశ్వరుని ఋజుత్వము సంపూర్ణముగా నిరూపిత మాయెను. ఫిర్యాదుచేసినవారు మాత్రము హతాశులై మఱియొక అవకాశమునకై వేచి యుండిరి.

అట్టివారికి మఱియొక అవకాశము త్వరలోనే దొరి కెను. ఎట్లన, బసవేశ్వరుడు వీరశైవమునందు శివభక్తులందఱు నొకే కులస్థులని సిద్ధాంతీకరించి, వారిలోపలగల జాతి, కుల లింగ భేదములకు స్వస్తి చెప్పి, అష్టాదశవర్ణముల వారికి లింగ దీక్ష లొసంగుచు, వారందఱికి సహపంక్తి లింగపూజలు, భోజనాదికములు చేయించుచుండెను. అట్టిశివభక్తులలో అం త్యజులు కూడ నుండిరి. బసవేశ్వరు డన్నివర్ణములవారితో కలసిమెలసి తిరుగుచుండెను. ఈ పద్ధతి పూర్వాచారపరా

యాలుగువారికి ముఖ్యముగా భూసురాగ్రగణ్యులకు కడుంగడు కంటకింపుగా నుండెను. వర్ణసంకరమొనరించి అమాయక ప్రజలను కులభ్రష్టులుగా బసవన్న చేయుచున్నాడని వారు ప్రచారము ప్రారంభించిరి. బిజ్జల మహారాజుకూడ సనాతనులతో నేకీభవించి యీపద్ధతిని గర్హించెను.

## 9. బిజ్జలునితో వైషమ్యము

[illegible] న్యాయుకాలిగ్రేలు [illegible] క్షీరంబు [illegible]గా
గ్రహించెనె [illegible] వెంటన గీటన్ రక్తముల్ ధారగా
గ్రహియించెన్ దగనాటి కొల్వున సభాస్తారుల్ నృపాలుండునిన్
[illegible]వముల్ సేయగ నట్టిసిద్ధమహిమన్ శ్లాఘింతు నందీశ్వరా!

ఒకనాడు బసవేశ్వరుడు హరిజనవాడకేగి యచ్చట నివాసమున్న శివభక్తశిఖామణి శివనాగుమయ్య యొక్క కుటీరమందు ప్రవేశించి, ఆ భక్తుడిచ్చిన ప్రసాదము నారగించెను. ఈ విషయము వెంటనే బిజ్జలునకు నివేదింపబడెను. బసవేశ్వరుడు తానిట్లు మైలపడుటయేకాక రాజాస్థానము కూడ ప్రవేశించి సింహాసనమునంతటిని మలినపరచుచున్నాడనికూడ బిజ్జలునకు నివేదించిరి. బిజ్జలుడు ఆగ్రహోదగ్రుడై బసవేశ్వరుని రావించి, రాజాస్థానమునకు వెలుపల బయలునందు కొలువేర్పాటుచేసి, అభియోగమును స్వయముగా విచారించెను. బసవేశ్వరుడేమాత్రము చలింపక తాను శివభక్తుడగు అంత్యజు నింటిలో భుజించుటలో తప్పు అణుమాత్రము లేదని వాదించెను.

ఆవిచారణలో బసవేశ్వరునకు బిజ్జలునకు నిట్లు సంవాదము జరిగెను.

బిజ్జలుడు :— బసవన్నా ! ఇదియేమిపని ? సద్బ్రాహ్మణకుటుంబములో జన్మించినావు. సదా శివభక్తికి పెన్నిధివైనావు. ఇది చాలదా ? భక్తిముదిరి వెఱ్ఱితలలువేసినదా ? నిమ్నజాతీయులతో కలసిమెలసి వారిని వీరమాహేశ్వరులని తెగపొగడుచున్నావు. వారియిండ్ల విందులారగించుటగాక, మమ్ములను మలినపఱచజూతువిది తగునా ?

బస :— రాజేంద్రా ! స్వయముగా ఆలోచించలేవు. చెప్పుడుమాటలువిని చెడెదవేల ? శివభక్తులుకాని అంత్యజుల ఇండ్ల నేను భుజించలేదు. నీకు ప్రియులైన విప్రుల వీధిని నేనడుగిడలేదు. ఇక ముందు అడుగిడనుసుమా!

బిజ్జ :— [మఱింతకోపముతో] భండారి బసవా ! ఏటిమాటలివి ? వేదశాస్త్రపురాణాదులు నేర్చి యజ్ఞయాగాదులొనర్చు విప్రులను అస్పృశ్యులుగా నిరసించుచున్నావు. అస్పృశ్యులగు శివభక్తుల గొప్పజేసి పలుకుచున్నావు. బ్రాహ్మణునిగోసిన రక్తమును శివభక్తుని గోసిన పాలును వచ్చునా ? చాలుచాలు చేసిన నేరము సమర్థించుకొనకుము. తాఁబట్టిన కుందేటికి మూడుకాళ్ళని వాదించకుము. ఇకనైనా బుద్ధిమై మనుము.

బస :— మహీధవా! మీరనినది నిజమే. బ్రాహ్మణునిగోసిన రక్తమే చిందును. భక్తుని గోసిన పాలేకారును. క్షణ కాలములోనే మీకు చూపింతును.

అనిచెప్పి శివనాగుమయ్యను పల్లకిలో రప్పించి సభలో నిలిపి, అందున్న ఒక బాపనయ్య శరీరముపై కత్తి నాటు పెట్టెను. రక్తమొక్కుమ్మడిగా చిమ్మగా సభాసదులు చూడలేక కనులుమూసికొనిరి. తదుపరి శివనాగుమయ్య కాలి బొట్టన వ్రేలిని గిల్లగా, పాలుపొంగి నేలంతయు తడిసెను. అందఱును భయసంభ్రమాశ్చర్యములతో నీ దృశ్యమును తిలకించిరి. దీనిని బట్టి బసవేశ్వరుడు తలపెట్టిన మత సాంఘిక సంస్కరణలు సనాతన విప్రులకును, బిజ్జలునకును మిక్కిలి కంటకప్రాయములుగా నుండెనను విషయము విశదము కాగలదు.

## 10. బిజ్జలుని అసహనము

రాజాస్థానములో అభియోగ విచారణ సందర్భమున బసవేశ్వరుడొనర్చిన వాదనను బిజ్జలుడు తాత్కాలికముగా నంగీకరించినప్పటికిని, వారిరువురకెగల భేదాభిప్రాయములు క్రమ క్రమముగా పెరిగి, ప్రబలవైషమ్యముగా మారజొచ్చెను. బసవేశ్వరుడు తాను ప్రారంభించిన సంస్కరణోద్యమమును, వీరశైవమతవ్యాప్తిని దృఢముగా కొనసాగించిన కొలదిని సామాన్య ప్రజాబాహుళ్యము అసంఖ్యాకముగా ఆమహోద్యమములో జేరుచుండిరి. బసవేశ్వరునెడ

ప్రజల కింతింతనరాని భక్తి ప్రపత్తులు కలిగెను. సనాతనా చారపరాయణులును బిజ్జల రాజును ఆ ఉద్యమ ప్రవాహ మునరికట్టుటకై చేయు ప్రయత్నములన్నియు విఫలము లాయెను. శివభక్తి వెల్లువవలె పొంగి దేశమునంతటిని ముంచివైచు చుండెను.

ఈ సమయమున బిజ్జలుడు చాళుక్యసామ్రాజ్యముపై దండెత్తి ఆ సింహాసనము నాక్రమించుటకై యెత్తులువేయు చుండెను. ఈ తరుణములో జనబాహుళ్యపు అండదండలాత నికెంతయు నావశ్యకమై యుండెను. అందుచే జనసమూ హమునకత్యంతము ప్రియముగా నున్న బసవేశ్వరోద్యమ మును నిరంకుశముగా నణచివేయుట కాతడు యత్నింప డయ్యెను. ఆకారణముచేతనే తాను సులువుగా చేయగలిగి నప్పటికిని, ఆతడు బసవేశ్వరుని పదవీభ్రష్టునిగావింపలేదు.

ఈప్రకారముగా ఒకవైపు మంగళవాడలో బిజ్జలుని రాజకీయాధికారము, పలుకుబడి విస్తరించుచుండగా మఱి యొకవైపు బసవేశ్వరుని సంఘసంస్కరణ మహోద్యమము మూడుపూవులు ఆఱుకాయలుగా వ్యాప్తిగాంచుచుండెను. ఈ పరిస్థితి 1141 సం॥ నుండి 1153 సం॥ వఱకును కొనసాగి నట్లు చెప్పవచ్చును.

## 11. కళ్యాణములో ఉద్యమ ఘనవిజయము

చ॥ కలియుగమందు సంఘమున కన్నను మిన్నగుశక్తిలేదు, భ
క్తులయెడజాతిభేదము ను గూర్చుట దోషమటంచు, వీరదీ
క్షలదయచేసి ప్రేమమున సర్వసమత్వపుదృష్టి నన్నిజా
తులొకటనెంచు నీవపరధూర్జటివౌటకు శంకయున్నదే!

క్రీ. శ. 1145 సం॥ లో త్రైలోక్యమల్ల బిరుదాంచితుడగు మూడవ తైలపదేవుడు చాళుక్యచక్రవర్తి ఆయెను. ఈతడు బిజ్జలునికి మేనల్లుడే; కాని తనపూర్వులంత సమర్థుడు కాడు. మొదటినుండియు చాళుక్యసింహాసనముపై కన్ను వేసి యుంచిన బిజ్జలునకు ఇప్పుడు గొప్పయవకాశము లభించెను. అంతకు ముందునుండియే స్వతంత్రపరిపాలన సాగించుచున్న బిజ్జలుడు 1 55 సం॥ లో స్వామిద్రోహమొనర్చి, కాకతి ప్రోలరాజు మొదలగువారి సాహాయ్యముతో తైలపదేవు నోడించి, కళ్యాణ పట్టణము నాక్రమించి, పశ్చిమచాళుక్య రాజ్యమందలి కొంతభాగము నపహరించెను. అప్పుడు తైలపుడు కళ్యాణపట్టణము విడిచి యన్నిగేరి, బనవసి మున్నగు ప్రాంతములందుండి, మిగిలిన రాజ్యభాగములను బరిపాలన మొనర్చెను. బిజ్జలుడు రమారమి ఆఱు సంవత్సరములు (1162-67) కళ్యాణపట్టణమును బరిపాలించెను.

బిజ్జలుడు చాళుక్య సింహాసనదురాక్రమణచేసిన తదుపరి, బసవేశ్వరు డాతని కొలువులో నుండెనో లేదో చెప్పలేము. మొదటినుండియు బిజ్జలుడు బసవేశ్వరోద్యమ ప్రతిస్పర్థియై దాని నణచివేయు నిశ్చయముతో నుండెను. కాని తానాక్రమించిన నూతన రాజ్యమును స్థిరపఱచుకొను యత్నములో పూర్తిగా నిమగ్నుడైన బిజ్జలుడు సుస్థిరముగా నెలకొన్న నూతన వీరశైవ సాంఘికవ్యవస్థపై దెబ్బతీయుటకు ఏవో కొన్ని ప్రయత్నములు చేసినను, అవి విజయవంత

ములు కాలేదు. తన ప్రాబల్యమునకే హాని వాటిల్లునను భయముతో ఆతడందులకై గట్టిప్రయత్న మొనరింపడా యెను.

చాళుక్యసింహాసన మాక్రమింపక పూర్వము కూడ చక్రవర్తి తన మేనల్లుడేకనుక, బిజ్జలుడు తఱచు కళ్యాణ పట్టణమునకు రాకపోకలు సాగించుచుండెను. ఆతనితోపాటు బసవేశ్వరుడుకూడ నప్పుడప్పుడు వెళ్ళి యుండవచ్చును. కళ్యాణనగరమే తన యుద్యమమునకు తగిన కేంద్రమని బసవన్న భావించి యుండవచ్చును. కావుననే, బిజ్జలుడు చాళుక్యసింహాసన మాక్రమింపకముందే బసవేశ్వరుడు తన ఉద్యమకార్యరంగమును మంగళవాడనుండి కళ్యాణనగరమునకు మార్చెను.

కళ్యాణనగరములోనే బసవేశ్వరుడు ప్రోదిసేసిన సంస్కరణోద్యమభూజము పెరిగి పెనువృక్షమై ఫలవంతమైనది. కళ్యాణమందు బసవేశ్వరుడు గడపినదినములే ఆతని జీవితమందు సముజ్జ్వల యోగకాలమని చెప్పవచ్చును. ఇచ్చోటనే అనతికాలములో తానాశించిన విధముగా ఘనవిజయ మాయునకు కైవసమైనది.

"నాసీదస్తి భవిష్యతి క్షితితలే కళ్యాణకల్పం పురమ్" అని ప్రశంసలు పొందిన కళ్యాణపట్టణము నాడు మహానగరముగా వర్ధిల్లినది. బసవనికి కళ్యాణబసవేశ్వరుడనియు, ఆ పురమునకు బసవకళ్యాణమనియు అన్వర్థనామములు సిద్ధించి

నవి. నేటి ప్రదేశము కర్ణాటక రాష్ట్రమందు గుల్బర్గాకు ఏబది మైళ్ళ దూరమున తొంటి వైభవము గోలుపోయి, చిన్న గ్రామముగా నున్నది. నేటికిని దానిని బసవకల్యాణమనియే పిలుచుచున్నారు.

బసవేశ్వరుని కార్య నిర్వహణ దీక్షాదక్షతలు నిరుపమానములు. కోశాధికారిగా తాను నడించిన గణితశాస్త్ర జ్ఞానము సంస్కరణోద్యమమును సక్రమపథమున నడిపించు నట్టి ప్రజ్ఞాపాటవముల నాతనికి జేకూర్చెను. ఆయన బోధించినదంతయు ఆచరణవేదాంతము కాని శుష్కవేదాంతము కాదు. అచంచల విశ్వాసముతో దృఢతరభక్తితో శివుని ఆరాధింపవలెననియు, జంగములను మాఱుట లింగమూర్తులుగా సేవింపవలెననియు, సంఘములో మతములో మానవులందఱు సమానులనియు నాతడు బోధించెను. తాను బోధించిన ప్రత్యక్షరము నాచరించి చూపించెను. తన ఉద్యమమును ప్రతిఘటించిన స్వార్థపరశక్తులను శిక్షించెను. భక్తసభలను, గోష్ఠులను, చర్చలను నేర్పాటుచేసి తాను విధిగా నందు పాల్గొనుచుండెను. ఇది సామాన్యప్రజను అమితముగా నాకర్షించి, మతమంటే వారలకు క్రొత్త దృక్పథమును కలిగించెను. సంప్రదాయమతము వేఱు; వాస్తవము వేఱు వేఱుగా నెల్లరకు అనుభవమాయెను. క్రొత్తమతములో అర్థరహితమైన ఆచారాలు లేవు; యాంత్రికమైన కర్మకాండ లేదు. అందుచే ఆసక్తిగల భగవద్భక్తులందఱు బసవోద్య

మములో చేరిపోయిరి. శివపారమ్యము బోధించి ప్రజలకు వెలుగుబాట చూపించు జంగములు అసంఖ్యాకులుగా వచ్చి బసవేశ్వరునికి బాసటగా నిల్చిరి. ప్రాతమతవ్యవస్థకైనాతడు బలమైన దెబ్బతీసి, నూతనవ్యవస్థలోనికి సర్వులను లింగదీక్షల నొసంగి చేర్చుకొనెను. వీరికి సమగ్రసాంఘికనియమముల నేర్పఱచెను.

బసవేశ్వరుడు సదా తన హృన్మందిరస్థుడగు సంగమేశ్వరుని ఆజ్ఞలను పాలించెడివాడు. రాజకీయాలలో నుండి గొప్పగొప్ప పదవులు నిర్వహించుచునే తన ఆధ్యాత్మిక గమ్యమగు లింగాంగ సామరస్యమును తాను సాధించవలెనని బసవేశ్వరునకు సంగమేశ్వరుడానతిచ్చెను. తన ఇష్టదైవమిచ్చిన ఆదేశముయొక్క పూర్తి అర్థమును మొదట బసవేశ్వరుడు గ్రహింపలేకున్నను, తన అధికారముద్వారా ఇంతత్వరలో తన కఖండవిజయము చేకూరుటెట్లగు, ఇప్పుడే దానిని గ్రహింపగలిగెను. తోడిశివభక్తుల సౌఖ్యమునకై నిరంతరము పాటుపడుచు, తానుస్వయముగా తరించి అసంఖ్యాకులైన భక్తులు తరించుట కాతడు సాధనపడెను. ఇట్లు బసవేశ్వరుడు తన ఉద్యమములో అనతికాలములోనే విజయలక్ష్మిని చేపట్టగలిగెను.

## 12. అనుభవమంటపము: అల్లమ ప్రభువు

ఆచరణాత్మక తత్త్వవేత్తయైన బసవేశ్వరుడు తాను తలపెట్టిన మత, సాంఘిక సంస్కరణోద్యమ విజయమునకు

సాధనకై ఒక సంస్థ నేర్పాటుచేయవలసిన యావశ్యకతను తొలుదొల్తనే గుర్తించెను. మంగళవాడలోనున్నప్పుడే శివశరణులు కొండోపతండములుగా నతని సన్నిధి కేతెంచి, తమతమ సంశయములను నివృత్తి చేసికొను చుండిరి. అందుకై సభలు, సమావేశములు, గోష్ఠులు, చర్చలు ఎడతెగక జరుగుచుండెను. కొన్ని సమావేశములలో అనుభవజ్ఞులైన శివశరణులు నిగూఢ తాత్త్వికవిషయాలలో తమకుగలిగిన అనుభవములను విశదీకరించుచుండిరి. శివభక్తులెల్లరు తమతమ అనుభవములను చెప్పుటకును, ఇతరుల అనుభవములను వినుటకును వీలుగా బసవేశ్వరుడు అనుభవమంటపమను సంస్థను స్థాపించెను. ఈ సంస్థ జననకాలమును సరిగా నిర్ణయింపలేము. బసవేశ్వరుడు మంగళవాడలో నున్నప్పుడే 1141సం॥ ప్రాంతమున అనుభవమంటప స్థాపన అయినట్లు చెప్పవచ్చును. అనుభవమంటపము యొక్క అధ్యక్షపీఠమున కాతడు శూన్యసింహాసనమను పేరుంచెను.

ఆకాలములో బళ్ళిగావెలో అల్లమప్రభువను మహాజ్ఞాని యుండెను. ఆతడు అధ్యాత్మసాధనలో పరిపూర్ణత పొందినవాడు. బసవేశ్వరు డాయననాశ్రయించి తన ఉద్యమమునకు ఆశీస్సులు ప్రసాదించ వలసినదిగా అభ్యర్థించెను. కొంతకాలము తరువాత అల్లమప్రభువు కళ్యాణనగరమున కేతెంచి బసవన్నను కలిసికొని ఆతని ఉద్యమమునకు సంపూర్ణసహకారమును అందించెను. బసవేశ్వరుని ప్రార్థనపయి నల్లమ

ప్రభువు అనుభవమంటపము యొక్క అధ్యక్షపీఠమున నధి ష్ఠించి, శివభక్తులకు తన బోధనలచే జ్ఞానోదయము కలిగించుచు, తద్ద్వారా బసవేశ్వరోద్యమ ఘనవిజయమున కెంతయో తోడ్పడెను. అల్లమప్రభుని, కేవలశివస్వరూపునిగా పేర్కొని, సోమనాథుడు బసవపురాణ ద్వితీయాశ్వాసము నందు–

"అంతకాంతకమూర్తి యతులితకీర్తి
వైరాగ్యసంసార వర్జితాత్మకుడు
సమలోష్టకాంచన సమసుఖదుఃఖ
సమమిత్రశాత్రవ సద్భావనుండు
దివ్యానిమిష సుధాదృష్టిగోచరుడు
భవ్యుండు గాంధర్వ పండితోత్తముడు
అంతరయోగ నిరంతరయోగ
వంతు డనంత వేదాంతవేద్యుండు
నిశ్శంకి శంకరి నిర్మాయి మాయి
నిశ్శబ్ది శబ్ది వినిర్భావి భావి"

ఇత్యాదిగా ప్రభుదేవుని ప్రస్తుతించి యున్నాడు.

మఱియును అనుభవమంటప చర్చలలో బసవేశ్వరుని మేనల్లుడైన చెన్నబసవేశ్వరుడు ప్రముఖపాత్ర వహించుచుండెను. బసవన్న చెల్లెలు నాగాంబ శివస్వామిని పరిణయమాడగా వారికి ప్రభవించిన కుమారరత్నమే చెన్న బసవేశ్వరుడు. ఈయన షట్స్థలసిద్ధాంత విజ్ఞానప్రపూర్ణుడు. షట్స్థలములందొక్కొక్క స్థలమును ఆఱువిభాగములుగా చేసి, ఒక్కొక్క విభాగమును మరల నాఱు భాగములుగ విభజించి మొత్తము స్థలముల సంఖ్యను 216 వఱకు పెంచినది చెన్న

బసవేశ్వరుడే. ఈ భక్తాగ్రగణ్యుడు బసవేశుని నిజగురువుగా భావించి బసవని శ్రీపాదబిసరుహంబులకు నసలార నిత్యంబు నర్చలిచ్చుచుండెను. సోమనాథుడీతనిని గూర్చి బసవపురాణ ద్వితీయాశ్వాసమునందు—

"ప్రస్తుతింపగనొప్ప బసవకారుణ్య
హస్తసంభూతప్రశస్త దేహుండు
సద్భక్తి యోగాత్ముండు చెన్న
బసవండు గురుభక్తిపాత్రోత్తముండు
సర్వాంగలింగి సంసారనిస్సంగి
గర్వాపహారి ప్రాక్తనశివాచారి
నిగమార్థసంవేది నిచితప్రసాది
అరివర్గసంహారి యాత్మోపకారి
లింగాభిమాని యాభంగురజ్ఞాని
సాంగత్యసువిధాని సతతావధాని
ఈశ్వరమూర్తి యతీంద్రియవర్తి
శాశ్వతకీర్తి ప్రసాదప్రపూర్తి"

ఈ విధముగా నభివర్ణించి యున్నాడు.

ఇంకను శివశరణు లనేకులు దేశదేశముల నుండి యేతెంచి అనుభవమంటపచర్చలలో పాల్గొనుచుండిరి. వారిలో ముఖ్యులు: సిద్ధరామయ్య, మడివాలు మాచయ్య, హావినహాల కల్లిదేవయ్య, హొన్నయ్య, బొమ్మయ్య, (కన్నడిగులు), ఉరిలింగదేవ, కమ్మర గుండయ్య (మహారాష్ట్రులు), బహురూపిచౌడయ్య, తెలుగేశ మసణయ్య, సకలేశమాదరసు, శ్రీపతి పండితయ్య (తెలుగులు) మాదర చెన్నయ్య, మెరెమిండె దేవయ్య (అరవలు), భద్రగాయక, చేరమ

రాయ) (కేరళులు), ఆదెయ్య, ఖోజ్జల శాచరసు (గుజరాతులు) నొళిగ మారయ్య, ఆతని భార్య మహాదేవి (కాశ్మీరీయులు.) వీరుకాక పలువురు మహిళలుండిరి: మహాదేవి, అక్కమహాదేవి, సత్యక్క, ముక్తాయక్క, గుండవ్వ, రెమ్మవ్వ అమ్మవ్వ, కాళవ్వ, నైజవ్వ, అన్నలాదేవి, పిట్టవ్వ, శివప్రియనాచి- వీరు కూడ వివిధదేశములనుండి వచ్చినవారే పైనిపేర్కొన్న భక్తులందఱును వీరశైవ సాహిత్యములోనుదాహృతులైనారు.

ఈ భక్తమండలియందు సంఘములో అన్నివర్ణములకు అన్ని అంతస్తులకు చెందినవారుండిరి. ధనవంతులు, పేదలు, అక్షరాస్యులు, నిరక్షరాస్యులు, అగ్రజులు, అంత్యజులు, అందఱునుండిరి. వీరిలో పెక్కురు ఏదోయొక వృత్తిని (కాయకష్టమును) చేసికొని జీవించువారే. మారయ్య, సకలేశ మాదరసు క్షత్రియులు. బసవేశ్వరుడు అగ్రజన్ముడు.ఆదెయ్య వణిజుడు. మడివాలు మాచయ్య రజకుడు. కుమ్మర గుండయ్య కులాలుడు. తలారి గ్రామదేవయ్య గ్రామతలారి. కిన్నర బ్రహ్మయ్య స్వర్ణకారుడు. జోధర మారన్న సైనికుడు. దోహార కక్కయ్య తోళ్ళపనివాడు. మాదరచెన్నయ్య చెప్పులు కుట్టువాడు. ఇంకను దర్జీలు, నేతగాండ్రు, మేదర్లు, గానుగవాండ్రు, గొల్లలు, కాపులు, మంగళ్ళు, బోయలు మున్నగువారిందుగలరు.

శా॥ జ్ఞానిన్ యోగివరేణ్యు నల్లముని వేడ్కన్ శూన్యసింహాసనా
సీనుం జేసి తదీయ దివ్యమహిమన్ శ్రీమాధురిందోఁగి, ని
త్యానందస్ఫురణ ప్రసాదరుచిభోగాసక్త భక్తావళిన్
జ్ఞానాంకున్ వశిఁ గొండ చేసిన నినున్ ధ్యానింతు నందీశ్వరా !
(గి॥ చెందుబసవరాజు)

## 13. బసవేశ్వరాడు లొనర్చిన మహిమలు

మున్ను మతమ్ములన్ సులభమోక్షదమైచను వీరశైవత
త్త్వోన్నతిజాటగా మహిమలొప్పఁగ జేసిన వీరభక్త సం
పన్నుల లింగదేహులను మాచయ బాచయ బ్రహ్మయాదులన్
సన్నుతమైస్మరించెదను మాటికి సద్భవతారకంబుగన్.

బసవేశ్వరుడును, తదనుయాయులైన భక్తశిఖామణులును చేసిన అనేకమహిమలను గూర్చిన గాథలు బసవపురాణము నిండ నున్నవి. అవన్నియు చారిత్రక ఘటనలేయని మన మంగీకరింపజాలము. కట్టుకథలు, అతిశయోక్తులును ఆ గాథలలో కుప్పలు తెప్పలుగా సహజముగా చేరియుండ వచ్చును. బసవేశ్వర జీవితచారిత్రకాంశములు తెలిసికొనుటలో భక్తుల చరిత్రలుకాక, బసవేశ్వరుడు స్వయముగా చెప్పిన వచనములే మనకెక్కువగా ఉపకరించుచున్నవి. కొందఱు భక్తుల మహిమోపేత గాథలను మాత్రమే దిగువను పొందుపఱచినాడను. వారిలో బసవేశ్వరునికి ప్రశిష్యులు కూడ గలరు.

### (1) మడివాలు మాచయ్య

మడివాలు మాచయ్య అను భక్తుడు తాను చేవు

నుండి యుదికి తెచ్చెడి బట్టలమూటను వీపుపై వైచుకొని మఠమునకు మరలివచ్చునప్పుడు నిచ్చలు ఖడ్గము, గంటయు గరమున ధరించి భక్తుల వస్త్రములను భవులెవరు తాకరాదనియు గాదని తాకినచో దన కరవాలమున కెరయయి, మరణింపగలరనియు గావున దన దారి నుండి వారు తొలగవలెననియు గంట మ్రోగించుచు హెచ్చరించుచుండెడివాడు. ఒకనాడు పరదేశి యొకడు సందడిలో మాచయ్య తెచ్చెడి బట్టలమూటను తాకెను. వెంటనే తన బాస చొప్పున వాని నాతడు సంహరించుట సంభవించెను. అందుపై గగ్గోలు పుట్టి జనులు పలువురు బిజ్జలునకు ఫిర్యాదుచేసిరి. రాజు కోపించి, వెంటనే తలారులను రావించి, యాచాకలివానిని వధింపుడని యాజ్ఞాపించెను. బసవేశ్వరుడు వారించినను వినడయ్యెను. మీదు మిక్కిలి తలారులతో నాతడు చాకి వచ్చెడు త్రోవలో దొలగక నిలిచి పట్టపు టేనుగును మాచయ్యపయిబై కొలుపుడని యానతిచ్చెను. అంతవారట్లు చేయుగా మాచయ్య తన వెన్నుపైనున్న బట్టలమూటను నభోమార్గమున నిటికించి, శరీరమును బెంచి, మదగజము తొండముపట్టి త్రోచి దానిని వ్రచ్చి వందరలాడెను. అంత మాచయ్య నాయేనుగును తనపయికి బంపినవానిని పోకార్చుగాక! యని బయలుదేఱుచున్నంతలో రాజునకు చారు లీ వార్త నెఱింగించిరి. అతడు నిర్విణ్ణుడయి ఖిన్నతతో మొగము

వంచి బసవేశ్వరుని పయి దృష్టినిగిడించెను. అప్పుడు బసవన్న "రాజా! నాహితవాక్యముల విననైతివి. మాచయ్య రజకాకృతినున్న ప్రత్యక్షరుద్రుడు కాని వేఱు కాడని నేను చెప్పలేదా? ఆమహానుభావు డిచ్చటికి రాకముందే యెదురేగి శరణు వేడుదము" అని యుద్బోధించెను. బిజ్జలుడు చేయునది లేక తలవంచుకొని బసవేశ్వరుని వెంటజని కొంతదూరము నుండి మాచయ్యగారినిజూచి భయముచే నడుగిడలేక యచ్చటనే సాష్టాంగ పూర్వకముగ నేలపయి వ్రాలెను. బసవయ్య మాచయ్యగారి కడ కేగి "మహాత్మా! శాంతించి బిజ్జలుని క్షమించు" మని ప్రార్థించెను. అంత మాచయ్య ప్రసన్నుడై బిజ్జలుని తన యొద్దకు రాఁబనిచి, తత్క్షణము యాతని మదగజేంద్రమును మడియించిన ప్రదేశమునకుం జని, యట్టలు, పొట్టలు, నస్థులు గూడ బెట్టించి, బసితంబు నాతునియలపైజల్లి, దానిని మరల బ్రతికించి, యాతనికొసంగెను. ఆఅద్భుత చర్యలకు బిజ్జలుడు నచ్చటి పౌరులు నివ్వెఱగుపడి, మాచయ్యను సన్నుతులొనర్చిరి. (బ. పు. చతుర్థాశ్వాసము)

## (2) బసవేశ్వరుడు

(i) శివభక్తుల రుద్రాభిషేకజలములచే కలిగిన కళ్యాణపట్టణవీథులందలి బురదలో కాలు జారి పడబోయి, యొకచల్లలమ్ముకొను గొల్లది "బసవా" యని కేక వేయగా, ఆ సమయమున బిజ్జలు సముఖమునమున్న బసవేశ్వరుడు ఆ

యార్తనాదము విని, తా నచ్చటనుండియును ఆ గొల్లత యెదుట ప్రత్యక్షమై చేయూత నొసంగెను. (బ. పు. ద్వితీయాశ్వాసము)

(ii) బిజ్జలునొద్ద కోశాధికారిగానున్న బసవేశ్వరుడు కైలాసమందు ఈశ్వరసన్నిధిలో నున్నాడో లేడో చూచి రమ్మని సిద్ధరాము డను భక్తుని భక్తగణములు పంపగా, అత డేగి శివుని హృత్పద్మమందు ఆసీనుడయియున్న బసవేశ్వరుని గాంచి యావృత్తాంతమును భక్తులకు వచ్చి చెప్పెను. (బ. పు. ద్వితీయాశ్వాసము)

(iii) కులము లేనివాడని (అంత్యజుడని) బ్రాహ్మణ సమూహము గొంతెత్తి పలుకగా, అన్ని కులములవారు చూచుచుండగా, శివనాగుమయ్య యను అంత్యజ భక్తుని హస్తమును తాను పట్టుకొని మథించి అం దమృతధారలను బసవేశ్వరుడు ప్రవహింపజేసెను. (బ. పు. సప్తమాశ్వాసము)

(iv) బసవేశ్వరుడు శివపూజా సమాధిలో నున్నసమయమున కొత్త జంగమ మొకడు చూడవచ్చెను. ఫణిహారి లోనికేగి యావార్త చెప్పెను. బసవేశ్వరుడు యోగనిద్రలో నుండుటచే బదులు పలుకడయ్యెను. ఈసంగతి విని కొత్త జంగమము వెళ్ళిపోయెను. బసవేశ్వరుడు జంగమప్రాణి యగుటచే జంగమముతోడనే ఆయన ప్రాణవాయువు వెడలి పోయెను. ఆయన నిశ్చేష్టుడై యుండెను. భక్తుల హాహాకారములు విని మడివాలు మాచయ్య ఆ నూతన జంగమ

మును పట్టణ మంతయు వెదకించి, తెప్పించి, బసవేశ్వరు నొద్ద నిలుపగా ఆయన ప్రాణము లేచి వచ్చెను. (పండితారాధ్య చరిత్రము)

(v) బసవేశ్వరుని గురుదేవు డయిన కూడలి సంగమేశ్వరస్వామి యొకపరి జంగమ వేషములో చనుదెంచి బసవేశ్వరుని మూడవకన్ను ఇమ్మని అర్థించెను బసవేశ్వరు డది కనిపెట్టి, అద్దములో చూచుకొమ్మని ఆ జంగమము మొగ మెదుట అద్దము నుంపగా, ఆ స్వామి మూడవ కన్ను అద్దములో కనిపించెను. ఈ సన్న యెఱింగి తత్క్షణమే స్వామి వెళ్ళిపోయెను. బసవేశ్వరుడు ఆగు మాగుమని కేకవేసినను ఆగక అదృశ్యు డాయెను. (బ. పు. ద్వితీయాశ్వాసము)

(vi) ఒక మిండ జంగమయ్య బసవేశ్వరుని సముఖమునకు వచ్చి తన యుంపుడుగత్తెయైన వేశ్యకై బసవేశ్వరుని భార్య గంగమాంబ ధరించు పట్టుచీర యిమ్మని కోరగా ఆతడు భార్యను ఆస్థానసదనమునకు బిలిపించి, తాను గంగమాంబ వలువ నొలిచి, జంగమమున కొసగి, గంగమాంబ మానము కాపాడుటకై అక్షయముగా పట్టువస్త్రము లిచ్చెను. (బ. పు. తృతీయాశ్వాసము)

(vii) బోయవాండ్రు (కిరాతులు) దేవాలయములో శివప్రసాదము తీసికొని భుజించెడివారు. శివప్రసాదము శివభక్తులే కాని యితరులు భుజింపకూడదని బసవేశ్వరు

డాంప పెట్టెను. బోయవాండ్రు బిజ్జలునొద్ద మొఱపెట్టు కొనిరి. అప్పుడు బసవేశ్వరుడు గొప్ప తర్కము చేసి తాను భక్తులును శివునకు శృంగి మున్నగు విషములు నైవేద్య మిత్తు మనియు, ఆ ప్రసాదము బోయలు గైకొనిన చో నితర ప్రసాదము కూడ గైకొనవచ్చుననియు వాదించెను. ఇది విని బోయవాండ్రు పలాయన మయిరి. ఆ సందర్భమున బసవేశ్వరుడును భక్తులును శివాలయమున శివునకు బిందెలతో విషమును అర్పించి, తా మందఱు దానిని భక్షించిరి. ఆ విషము భుగులుభుగుల్లున బొగలి, కెంబొగలు నగయు, విషార్చుల గగనంబు గప్పెను. (బ. పు. సప్తమాశ్వాసము)

(viii) మహాజ్ఞాని అల్లమప్రభువు ఒకనాడు బసవేశ్వరుని భక్తిని పరీక్షించు నిమిత్తము రాగా, ఆయనను సముచితాసనమున గూర్చుండజేసి, ప్రణమిల్లి, బసవేశ్వరుడు పంచభక్ష్యాన్నముల నారగింప వడ్డించెను. ఆ పదార్థములను బసవడే పెద్ద పెద్ద ముద్దలుగా జేసి అల్లమప్రభుని నోటి కందిచ్చుచుండగా నాత డారగించుచుండెను. ఇట్లు లక్ష యెనుబది వేల జంగములకొఱకు వండిన పదార్థమంతయు నారగించెను. ఇంకేమియు మిగులనందున, బసవేశ్వరుడు సాష్టాంగ మెరగి తానే యిక నోగిర మౌదునని విన్నవించెను. అప్పుడు అల్లమప్రభుడు బసవేశ్వరుని భక్తికి మెచ్చి, ఆతని ననేక విధముల కొనియాడెను. (బ. పు. ద్వితీయాశ్వాసము)

(ix) ఒక జంగమయ్య బసవేశ్వరునొద్దకు వచ్చి పుట్టెడు ముత్యముల ముగ్గుతో శివపూజ గావించు నియమము

తన కున్నదని చెప్పగా ఆ నియమము నెఱవేరుటకయి బసవేశ్వరుడు తన కొఠారమందలి జొన్నలరాశిపయి చూపు నిలుపగా అవి యన్నియు ముత్యములై ఆ జంగమయ్య యొక్క నియమ మీడేఱెను. (బ. పు. ద్వితీయాశ్వాసము)

(3) చోళల దేవర బాచిరాజు

ఈయన ఇతరమతస్థులతో వాదించి వీరశైవ మతము యొక్క ఆధిక్యమును స్థిరపఱిచెను. శ్రుతి స్మృతి మూలములను, వేదాంతోక్తులను, న్యాయవైశేషికాది శాస్త్రములను, బహుపురాణాగమార్థములను ప్రమాణములుగా చూపించి వీని నన్నింటను అంభికాధవుడైన పశుపతియే కర్త, పలు వేలుపు లెల్ల పశువులే యని నిరూపించెను. (బ. పు. షష్ఠాశ్వాసము)

(4) మోళిగ మారయ్య

మోళిగ మారయ్యకు కట్టెల మారయ్య అను పేరు కూడ కలదు. అతడు మొదట కాశ్మీరదేశమున రాజుగా నుండి బసవేశ్వరుని ప్రభావము విని రాజ్యసంపదలు విసర్జించి కళ్యాణపట్టణమున కేతెంచెను. అచ్చట కాయకష్టము చేసి, అనగా అడవికి వెళ్ళి కట్టెలు కొట్టి తెచ్చి, విక్రయించెడివాడు. ఒకనాడు బసవేశ్వరు డాయన యింటికి జంగమవేషధారియై వెళ్ళి, యింట మారయ్య లేకున్నను, భార్యను ఆకలివేయు చున్నదని అడిగి, ఆమె వడ్డింపగా భుజించెను. ఆయన తిన్న పళ్ళెరము క్రింద కొన్ని సువర్ణనాణెము లుంచి వెడలిపోయెను. తర్వాత పళ్ళెరము కడుగుసమయమున భార్య కవి కనుపిం

చేను. తదుపరి మారయ్య వచ్చి అడుగగా, భార్య తన కేమియు తెలియ దనియు, ఒక అయ్య వచ్చి భోజనము చేసి వెళ్లె ననియు చెప్పెను. బసవేశ్వరుడే యీపని చేసె నని మారయ్య గ్రహించెను. అప్పు డతడు జంగమములు రాగా వారి పాదములు కడిగి తత్పాద తీర్థము తాను దెచ్చిన కట్టెల మోపుపయి జల్లగా, కట్టెలు బంగారు కడ్డీ లాయెను. ఆ బంగారుకడ్డీ లన్నిటిని జంగమముల కాయన పంచియిచ్చెను. జంగమము లీసంగతి బసవేశ్వరునకు నివేదించగా ఆయన వెళ్ళి మారయ్యను క్షమింపు మని వేడెను. (బ. పు. పంచ మాశ్వాసము)

## (5) ముసిడిగ చౌడయ్య

ఈయన తనయొక్క వివాహమునకు తరలివెళ్ళుచు, మార్గమందు చచ్చి పడియున్న వృషభమును గాంచెను. చౌడయ్య భస్మము నీళ్ళు చల్లగా నది సజీవ మయ్యెను. ఆ వృషభముతో నాతడు "బసవా!" నీవుకూడ నా వివాహమునకు రమ్మని వెంట తీసికొని వెళ్లెను. (బ. పు. పంచ మాశ్వాసము)

## (6) కన్నద బ్రహ్మయ్య

కన్నద బ్రహ్మయ్య దొంగతనమే వృత్తిగా జీవించుచు, తన యింటికి భక్తు లేతేరగా నెక్కడయినను కన్నము వేసి, తద్వారమున లభించిన సొమ్మును గణార్చనకు వినియోగించెడివాడు. ఒకనాడు బిజ్జలుని బొక్కసమున కన్నము వేయ నెంచి, బసవేశ్వరుని తనకూడ రమ్మని యడిగెను. బసవే

శ్వరుడు వల్లె యని వెంట వెళ్ళెను. బసవేశ్వరుని యెదుటనే ఆతడు కన్నము వేసి, సొమ్ము అపహరించెను. ఈసంగతి రాజునకు తెలిసెను. బసవేశ్వరు డప్పుడు రాజుతో "నిన్ను ధన్యుని జేయుటకే కన్నము వేసినా" డని చెప్పి, రాజును తీసికొని వెళ్ళి కన్నము వేసిన చోట, గోడ రాళ్ళును, ఇసుకయు రత్నరాసులుగా మారి ప్రకాశించుచుండుటను కనుపఱచెను. (బ. పు.)

(౯) బిబ్బ బాచయ్య

గొబ్బూ రను నూరిలో బిబ్బ బాచయ్య యను భక్తుడుండెను. ఆయన గణార్చన జరుగు చోటు కేగి అచటి భక్తుల యెంగిలిప్రసాదము సేకరించి బండిపై నెక్కించి ప్రసాదముపై వస్త్రము గప్పి బండిని తోలుకొని బ్రాహ్మణ గృహముల మధ్యనుండి వచ్చుచుండెను. అది గాంచి బ్రాహ్మణులాగ్రహించి యెంగిళ్ళు అగ్రహారము మీదుగా తీసికొని వెళ్ళెదురా యని బిబ్బ బాచయ్య నడ్డగించి నిల్పి, బండిని ఊరిబయటకు గొట్టమనిరి. ప్రసాదప్రభావప్రశక్తి నూ పెదగాక యని బాచయ్య ప్రసాదము అంజలితో నెత్తి బ్రాహ్మణ గృహములపయి చల్లెను. అంతట మంట లెగసి బ్రాహ్మణ గృహములన్నియు కాలి మసియయ్యెను. అప్పుడు విప్రులతనికి సాష్టాంగులై మ్రొక్కి శరణువేడగా అతడు ప్రసన్నుడై ప్రసాదాగ్ని నుపసంహరించెను. అతని యనుగ్రహమున విప్రగృహములు ఎప్పటి క్రియ నొప్పెను. (బ. పు. సప్తమాశ్వాసము.

(8) మొఱటద వంకయ్య

ఈయనకడకు ఒక భక్తు డర్ధరాత్రి వచ్చి లింగార్చనకు మొదవుపాలును, మారేడు పత్రియు కావలె నని చెప్పగా, కొంకక వంకయ్య గొడ్డును తెచ్చి, యొక కొఱటును సంధించి మనసిజహరభక్తమండలి దలచి, కుండను గొనివచ్చి పిదికెను. ఆ గొడ్డుటావు కుండ నిండుగ పాలు కురిసెను. కొఱటయందే పత్రి యంకురితమై పరగెను. ఈ విధముగా మొఱటద వంకయ్య యా భక్తుని నేమము చెచ్చెర చెల్లించెను. (బ. పు. ద్వితీయాశ్వాసము)

(9) హావినహాళ్లి కల్లి దేవయ్య

హావినహాళ్లి యను పురమందు కల్లి దేవయ్య యను భక్తు డుండెను. అతనికి నా యూరి విప్రులకు వివాదము సంభవింపగా శివుడే పరమాత్మయు, పరబ్రహ్మము ననియు, హరివిరించ్యాదులు జీవాత్మ లనియు, వారుకూడ శివభక్తులనియు వాదించెను. మఱియు బ్రాహ్మణులు శివభక్తుల యిండ్ల గల శ్వానములకుగూడ సరిరారని చెప్పెను. ఇట్లు చెప్పి ఒక శునకమును బిలిచి, వేదపనసలు చదువు మనగా, నా శునకము విశుద్ధస్వరమున ఉదాత్త అనుదాత్త స్వరములతో, పదమును క్రమమును పాటయు జటయు, నాల్గు వేదములయందు నొక్కొక్క తావెత్తి యనుష్ఠించెను. ఇట్లు విప్రులందఱు వినుచుండ కల్లి దేవయ్య కుక్కచే వేదములు చదివించెను. (బ. పు. సప్తమాశ్వాసము)

## (10) హలాయుధుడు

శివుడును చిఱుతొండనంబియు భక్తవేషములతో హలాయుధుడున్న పురికి రాగా, హలాయుధుడు వారిని భక్తితో పూజించి కుశలప్రశ్న గావించెను. శివుడు గొందఱు భక్తుల పేర్కొని, చిఱుతొండని చరితము చెప్పి, యతని నెక్కువగా కొనియాడెను. హలాయుధుడుగ్రుడై "భక్తవత్సలుడగు శివుడు మాంసాహార మెట్లు కోరెను? చిఱుతొండసెట్టియు దన కోమటిబుద్ధి మానలేక యేమాశించి తనను మానుకొని, భక్తుడయిన తనయుని చంపెను? భక్తుని జంపించిన రక్కసుడయిన శివుడును, భక్తుడైన సూనుని జంపిన చిఱుతొండడును భక్తప్రపంచమునుండి వెలియైనా" రని చేతాళము వేసి చాటించెను. మనసిజారి బదులుపలుక వెఱచి తన మనమున పార్వతీదేవిని దలంపగా, నామెయు సంగళవ్వయు జంగమురాండ్ర వేసములతో వచ్చి తమ పతుల తప్పుల మన్నించి, వారికి సద్భక్తి భిక్ష ననుగ్రహింపుమని హలాయుధుని వేడుకొనిరి. అప్పుడు హలాయుధుడు హరునకు, చిఱుతొండనికి నభయ మొసంగి వారి వెలిని తొలగించెను. (బ. పు. చతుర్థాశ్వాసము)

## (11) మల్లికార్జున పండితారాధ్యుడు

ఈయన బసవేశ్వరుని గాంచు నిమిత్తము బైలుదేరి వెళ్ళుచు దారిలో చందవోలులో విడిసి, అచ్చటి రాజగు వెలనాటి చోడుని బౌద్ధగురువుతో వివాదము సలిపి గెలిచెను.

అంత బౌద్ధగురువు మత్సరగ్రస్తుడై నిజానుచరులచే పండితుని పూజామందిరమందలి దీపస్తంభమును దొంగిలింప జేసెను. అప్పుడు పండితుని శిష్యులు శివద్రోహమునకు సహించక బౌద్ధగురువును చంపిరి. ఇందుల కాగ్రహించి రాజు పండితునకు అక్షి దండనము విధించెను. అతని నేత్రములు తీయించి కనుగొలకులనిండ జీడిపాలు పోయించెను. రాజును వంశక్షయ మగునట్లు శపించి, పండితు డంత చందవోలు విడిచి వెళ్ళెను. ఆత డమరావతి చేరి యట అమరారామక్షేత్రమున అమరేశ్వరుని సందర్శించి, యా దేవదేవునకు అమరాష్టకాది కృతుల నర్పించి, యాయన ప్రసాదమున ఊర్ధ్వ నేత్రయుగ్మమును స్వీకరించెను. (పండితారాధ్య చరిత్రము: మహిమప్రకరణము)

## (12) బెజ్జమహాదేవి

"శివునకు ప్రపంచమంత బలగ మున్నదికాని తల్లి లేదు కదా! తల్లి యున్నచో తోలుగట్టుకొని పాములు ధరించి బూడిద బూసికొని వల్లకాటిలో దిరుగనిచ్చునా? తిరిపె మెత్తనిచ్చునా? విషము త్రాగనిచ్చునా? తల జడలు గట్టనిచ్చునా?" యని తలపోసి తల్లి లేని లోటును దీర్తు నని బెజ్జమహాదేవి శశిధరు నొక శిశువుగా భావించి, నిత్యము నభ్యంజనము చేయించుచు, బొట్టు కాటుకలు పెట్టుచు, ఉగ్గులు బోయుచు, ముద్దాడుచు నిట్లు సకల బాలోపచారములు చేయుచుండెను. భక్తు డెట్లు భావించిన శివు

డట్లు వర్తించును కదా! కొన్నిదినములు చనునంత, దేవ దేవు డాయమ్మకు ప్రసన్నుడు కాదలచి, చన్ను గుడువక, వెన్నకైన నోరు తెఱవక, రోగమువచ్చినక్రియ నుండెను. అది గాంచి ఈమె బిట్టులుక్కుపడి, "నా యన్న, నా కూన, నాచిన్నివడుగ చన్నేలరా కుడువకున్నావు? కన్న మోహము కన్న పెంచిన మోహ మెక్కువ. నీ విట్లున్న నే నోర్వలే" నని యిత్యాదిగా దుఃఖించి, తల గొట్టుకొని ప్రాణములు విడువ సిద్ధము కాగా, మహాదేవుడు ప్రత్యక్షమై వరము గోరు కొమ్మనెను. నీవు నిరోగివై నిత్యసుఖావాప్తి నున్న నాకు అదే చాలు నని యా యమ్మ చెప్పగా, శివు డనుగ్రహించి ఆమెకు నిత్యత్వ మొసంగెను.

## 14. బసవేశ్వరుని శీలము

సర్వమానవ సౌభ్రాత్రము బసవేశ్వరుని జీవితము నకు ప్రధానసూత్రము. స్త్రీపురుష విభేదమును, జాతి విభేద మును లేక యందఱుగూడ నాత్మజ్ఞానము సంపాదించి, శివజీవైక్య సిద్ధి బడయుట కర్హు లనెడి వీరశైవమత ధర్మము నుద్ధరించి, అనతికాలములో నీమతమును విస్తరింప జేసిన మహావ్యక్తి బసవేశ్వరుడు. "దీయతే లింగసంబంధః క్షీయతే చ మలత్రయమ్ దీయతే క్షీయతే యస్మాత్ తస్మాత్ దీక్షేతి కథ్యతే" అను శివాగమ ప్రమాణముచే వీరశైవ దీక్ష నొందినంతనే సాధకుని యాణవిక, కార్మిక,

మాయామలములు నశించి, భౌతికశరీరము లింగశరీరముగ మారి, తొంటి కులములు మలములు దగ్ధము లగును గావున వీరశైవదీక్షితు లందఱు సోదరప్రాయులని యాతడు బోధించెను.

అన్ని వర్ణముల వారికి, అంత్యజులకు గూడ బసవేశ్వరుడు శివదీక్షలు ప్రసాదించి తన్మూలమున పతితజనోద్ధరణముగూడ సాధించెను. దేవాలయ ప్రవేశములతో తృప్తి నొందిన నేటి సంస్కర్తల హరిజనోద్ధరణమువలె గాక, బసవేశ్వరుడు దీక్ష బడసిన పతిత జనులకు శీలమును, సాంఘిక నియమమునుగూడ ప్రసాదించి, వారిని పూర్తిగా కులజులతో సమానులుగా చేసెను. అందుచే బసవేశ్వరుడు గావించిన పతిత జనోద్ధరణ మా పతితజనుల యంతరంగ బహిశ్శుద్ధులకు దానకమయి, శాశ్వత ఫలదాయక మయినది.

త్రికరణశుద్ధి, లింగజంగమములయెడ నభేదబుద్ధి, లింగ జంగమములకు తనుమనోధన సమర్పణ, అనన్య శరణ్య బుద్ధితో కూడలి సంగమేశ్వరునందలి విశ్వాసము, అన్య దేవతా స్మరణరహితమగు ఏకేశ్వరోపాసనము, పరసతీ పర ధన పరాఙ్ముఖత్వము ననునవి బసవేశ్వరుని శీలమునకు సహజాలంకారములుగా నుండెను. ఇందుగూర్చిన హెచ్చరికలాతని వచనములలో పలుతావులందు మనకు గోచరించును.

పురుషార్థములలో ప్రప్రథమ మగు ధర్మమునకు దయ మూలముగా నుండవలయు నని బసవేశ్వరు డుద్ఘో

పించెను. 'దయ యిల్లద ధర్మవ దేవుదయ్యా' దయలేని ధర్మ మెట్టిదని యాతడు లోకమును ప్రశ్నించెను. ఆయన దయా గుణమును గుఱించి సోమనాథుడు తన కృతులలో 'నీవు దయాపయోనిధివి' 'బసవయ్య కృపాంబుధి' 'యస్యాపాంగ సహోదరీ చ కరుణా' 'ఇ వ్వసుమతి బుట్టి భక్తజనవశ్యుడవైన కృపాసముద్ర!' ఇత్యాది వర్ణనలు చేసినాడు. కరుణారస మనుగ్రహించువానిని, పరిగ్రహించువానిని గూడ పవిత్ర మొనర్చునని షేక్సుపియరు మహాకవికూడ వర్ణించియున్నాడు గదా!

బసవేశ్వరునకు గల జంగమభక్తి వర్ణనాతీతము. ఆత డహంకారశూన్యుడై తనను వారికి సర్వార్పణ గావించు కొనెను. 'నాకన్న పిన్నలు లేరు; శివభక్తులకన్న పెద్దలు లేరు' అని ఆయన యొకవచనములో తన నమ్రతను వెల్ల డించెను. భక్తులందఱును సాక్షాత్తు కూడలి సంగమేశ్వరుని మాఱుట మూర్తులే యని యాతని నిర్మలభావము. నిత్యము నాతడు లక్ష తొంబదియాఱువేల జంగములకు గణార్చన మొనర్చువాడను వాడుక పరంపరగా వినవచ్చుచున్నది. ఇట్లని సోమరిపోతులెల్ల చేరి బసవని యింటిలో విందు లార గించెడివారని భ్రమింపరాదు. బసవని జంగమ దాసోహ వ్రతములో అర్థి దాత యను తారతమ్యము లేదు. ఆనాటి శరణులు తృణీకృత హరిబ్రహ్మ పురందరులు; కాయకమే కైలాసమని గుర్తించి వారేదో యొక కాయకవృత్తి నవలం

బించి జీవితము నెఱపినవారే. కన్నెల హారయ్య, కలకేత బ్రహ్మయ్య, మడివాలు మాచయ్య మున్నగు భక్తుల చరిత్రము లిందుకు సాక్ష్యము. బసవని భక్తిగౌరవముల కలరియే వా రాతని సపర్యల స్వీకరించిరని భావింపవలసియున్నది.

బసవేశ్వరుడు సకలశాస్త్రము లభ్యసించినవాడు గావున జ్ఞానచక్షుష్మంతుడు; మహారాజ సచివుడు గావున చారచక్షువు. ఇట్టి బసవేశ్వరునికి సోమనాథుడు ఒకవిధమైన జనుషాంధత్వమును (పుట్టు గ్రుడ్డితనమును) గల్పించినాడు. అదెట్టిదన "పరవనితాజన భాసురతర ముఖమండల వీక్షణ విధి జాత్యంధాత్", పరవనితా ముఖవిలోకనవిధియందు బసవేశ్వరుడు జాత్యంధు డని దీని యర్థము. సామాన్య కవి యైనచో నింత రమ్యముగా దీనిని జెప్పజాలడు.

పరధనమువల్ల గూడ బసవేశ్వరుడు విముఖుడే. నిత్యము జంగమారాధనల కాతడు బొక్కసములోని ధనము వెచ్చించుచున్నా డని కొందఱ ఉద్యోగులు బిజ్జలునకు కొండెములు చెప్పగా, రాజు ధనాగారమందలి సొమ్మును లెక్క వేయించినపు డది సరిపోయిన వృత్తాంత మెల్లఱకు తెలిసినదే. నిజ మాలోచింప, నిత్యజంగమారాధనలకు బొక్కసమందలి రొక్కము మాత్రము సరిపోవునా ? వలయు ధన మిచ్చునది సంగమేశ్వరుడే, జంగమముఖమున నారగించునదియు నతడే; ఒడయుల ధనమునే యొడయుల కొసగుచుంటి నని బసవేశ్వరుడు చెప్పుచుండిన సమాధానములోని పరమార్థము వేఱుగా చెప్పనక్కఱలేదు.

## 15. బిజ్జలుని అత్యాచారము : కళ్యాణములో సంక్షోభము

బసవేశ్వరుని సంస్కరణోద్యమమునకు గలుగుచున్న బ్రహ్మాండమైన జనాదరణను బిజ్జలుడు మొదటినుండియు భయాందోళనలతో కనిపెట్టుచుండెను. ఇప్పుడైనను దాని యభివృద్ధి నరికట్టుటకై కట్టుదిట్టమయిన చర్యలను తీసికొందమని యాతడు నిశ్చయించుకొనెను. కళ్యాణనగరములో అల్లయ్య, మధుపయ్య అను పెద్దలు బసవేశ్వరుని అనుయాయులుండిరి. వారు పరమ శివభక్తులు; బసవనియందనురక్తులు. అల్లయ్య హరిజనుడు; మధుపయ్య బ్రాహ్మణుడు. మధుపయ్య పుత్రికను అల్లయ్య పుత్రున కిచ్చి వివాహము చేసిరి. ఇది ప్రతిలోమ వివాహము; చట్టరీత్యా చెల్లదని బిజ్జలుడు అభియోగమును తెచ్చి, అల్లయ్య మధుపయ్య లిద్దఱిని రప్పించి, వారికి కనుగ్రుడ్లను పెరికించు శిక్షను విధించెను.

ఈ అత్యాచారము వీరశైవ మహాజనుల నందఱిని ఆగ్రహావేశుల గావించెను. అయితే యిప్పట్ల మన కర్తవ్యమేమిటి? అని వీరశైవులు సమాలోచనలు జరిపిరి. ఈచర్య వీరశైవోద్యమమునకే గొప్ప సవాలుగా వారెంచిరి. ఇందుకు ప్రతీకార చర్యను తీసికొను విషయములో బసవేశ్వరుని అనుయాయులు రెండువర్గములుగా చీలిరి. తీవ్రవాదులు జగదేవుని నాయకత్వమున హింసకు ప్రతిహింసచేయుటకే సిద్ధపడిరి. శివాపచారము గావించిన పాతకిని మదముట్టించుటే

శివభక్తుల విధి యని వారు వాదించిరి. కాని రెండవవర్గము వారు క్షమను శాంతమునే ఉద్బోధించుచువచ్చిరి. బిజ్జలుని కడతేర్చు ప్రతిపాదనను బసవేశ్వరుడు ప్రతిఘటించెను. కాని ఆ మహాత్ముని శాంతివచనము లా మహోద్రిక్తపరిస్థితులలో తీవ్రవాదులు చెవినిబెట్టరైరి.

ఉద్యమము విప్లవముగా మారెను. విప్లవాశ్వమును పగ్గములు లాగిపట్టి ఆపుజేయుటలో బసవేశ్వరుడు కృతకృత్యుడు కాలేకపోయెను. పరిస్థితి ఏక్షణములోనైనను బ్రద్దలగుటకు సిద్ధముగా నుండెను. హింసకు వెనువెంటనే ప్రతిహింస జరిగి తీరును. దానితో సర్వనాశనము తప్పదు. బసవేశ్వరు డంతకు ముందే హింసాత్మకచర్యలవల్ల చాళుక్య రాజ్య మెట్లు విచ్ఛిన్నమయినది చూచియే యున్నాడు గదా! తాను కారణముగా హింసాప్రజ్వలనము బసవేశ్వరుని కెంతమాత్రము ఇష్టము లేకపోయెను. కాని ప్రళయము రానే వచ్చెను. బసవేశ్వరుని సన్నిహితులు కొందఱు ప్రతీకార వ్యూహములో ఇఱుకుకొనిరి. ఇక పూర్తిగా వైదొలగుట యొకటే తాను చేయదగిన పని యని బసవేశ్వరుడు భావించెను. ఇది యా సంగమేశ్వరుని సంకల్పము అని యాతడు నిశ్చయించుకొని తన జీవితకార్యము అయిపోయినది గనుక ఏ భగవచ్ఛక్తి తనను ఆ కార్యమునకు నియోగించి పంపినదో, తిరిగి దానివద్దకు చేరుకొనుటయే తన ప్రకృతవిధిగా నాతడెంచెను.

అంత బసవేశ్వరుడు కొద్దిమంది అనుచరులతో కళ్యాణనగరము వదలి కూడలి సంగమేశ్వరమునకు పయనమాయెను. "ఈ ప్రపంచపు గోల యిక చాలు! తండ్రీ కూడలి సంగన్నా! నీలో నా కాశ్రయ మిమ్ము", అని బసవన్న ఆక్రోశింప, సంగమేశ్వరు డట్లే అనుగ్రహించెను. ఆ భక్తశిఖామణికి సంగమేశ్వరునిలో నున్న తన ఉనికి అప్పటున అనుభూతమాయెను. మహానందపరవశుడై బసవన్న ఆ లింగములో నైక్యమాయెను. ఈసంఘటన 1167 సం॥లో జరిగియుండును.

బసవేశ్వరుని లింగైక్యము తరువాత జగదేవ మొల్లెయ్య, బొమ్మయ్య అను తీవ్రవాదనాయకులు ప్రతీకారమునకు సన్నద్ధులై, దానికి తగు పన్నాగములు వేసి, రాచనగరులోనే బిజ్జలుని నిహతుని గావించిరి.

దానితో నగరమంతట సంక్షోభము వ్యాపించెను. బిజ్జలుని బంధువులును సైన్యమును కలిసి బసవేశ్వరుని భక్తబృందములపయికి సాయుధులై విజృంభించిరి. దానికి శివభక్తులు తట్టుకొనలేక కళ్యాణనగరము విడిచి నానాముఖములుగా పారిపోయిరి. కొందఱు సంగమేశ్వరము చేరిరి. కొంతమంది ముఖ్యులు చెన్నబసవేశ్వరుని నాయకత్వము క్రింద "ఉళవి" యను పురమునకు వెళ్ళగా, మఱికొందఱు శ్రీశైలమున కేగిరి. ఈప్రకారముగా ఉద్యమము తాత్కాలికముగా దెబ్బతిన్నది కాని క్షీణించలేదు. క్రమక్రమముగా

పుంజుకొనుచునే వచ్చినది. రెండున్నరశతాబ్దు లగునప్పటికి వీరశైవవ్యవస్థ కర్ణాటకమంతయు వ్యాపించుటే కాక, సరిహద్దున నున్న మహారాష్ట్ర, ఆంధ్ర రాష్ట్రాదులకుగూడ ప్రాకి వర్ధిల్లినది.

## 16. బసవేశ్వరుని వచనాలు

కన్నడవాఙ్మయమ్మున కఖండ రసప్లుత మాధురీఝరీ
స్విన్నత నూర్చు భక్తి శశిశేఖరమూర్తివిగా వెలింగి వి
ద్వన్నుత వేదసారము నపారవచస్సుధ నిల్పి వీరశై
వోన్నతి జాటినాడవు సముజ్జ్వలతన్ బసవేశ్వర ప్రభూ!

బసవేశ్వరుడు నాల్గు లక్షల యిరువదినాల్గు వేల గీతములు రచించినట్లు సోమనాథుడు తన బసవపురాణమున నుదాహరించినాడు; బసవేశ్వరవచనములని కర్ణాటవాఙ్మయమున ప్రశస్తి గాంచిన యీ గీతములలో శ్రీ హలకట్టి, బసవనాళ్ మున్నగు పరిశోధకుల విశేష పరిశ్రమపూర్వకముగ నిప్పటికి ఏ తొమ్మిది వందలో లభ్యమయినవి. వేదవేదాంత సారములయిన అసంఖ్యాకములగు బసవేశ్వరుని గీతములు పెక్కులు కాలగర్భమునం దడగిపోవుట లోకముయొక్క దురదృష్టము.

బసవేశ్వరుడు, అల్లమప్రభువు, అక్కమహాదేవి మున్నగువారు కన్నడభాషలో రచించిన వచనాలకు ఆ వాఙ్మయములో ప్రత్యేకస్థాన మున్నది. అవి భక్తి జ్ఞాన వైరాగ్య నీతి వేదాంత బోధకములుగ గణ్యత గాంచి, పండిత పామర

సుబోధకములై, రాగయుక్తముగా చదువుకొనుటకు వీలుగా నుండి, వీరశైవులకే కాక, అన్యమతస్థులకు, జిజ్ఞాసువు లగు ముముక్షువుల కెల్లరకు నత్యంతోపకారకంబులై, భవతారకంబులై వెలయుచున్నవి. ఈ వచనములకు 14 భాషలలో అనువాదములుగూడ వెలువడినవి. తెలుగులోనికి అనువదింపబడిన బసవేశ్వరుని వచనములలో కొన్నింటిని సంగ్రహముగా నుదాహరించుచున్నాను.

(1) నాకన్న పిన్నలు లేరు. శివభక్తులకన్న పెద్దలు లేరు. నీపాదసాక్షి. నామనస్సాక్షి. కూడల సంగమదేవా! నా కిదియే శ్రేష్ఠము.

(2) తండ్రివి నీవు, తల్లివి నీవు, బంధువు నీవు, బలగము నీవు, నీవుగాక ఇంకెవ్వరు లేరయా, కూడల సంగమదేవా! పాలముంచుము; నీటముంచుము.

(3) నా నడువడి వేఱు. నుడువులు వేఱు. నా యంతరంగమునం దేమాత్రము శుద్ధి లేదు చూడయ్యా! కూడల సంగయ్యా! నాయుం దుండుమయ్యా!

(4) సుందరమైన పల్లకియం దుంచినను, శునకము తన నీచస్వభావమును విడువక చెడుపదార్థములనే యెట్లభిలషించునో అట్లే నామనస్సు దుర్విషయములపైకి పోవుచున్నది. దేవా! నీ ధ్యానము చేయనీయక అడ్డు వచ్చుచున్నది. కూడల సంగమదేవా! నీ చరణములను ధ్యానించునట్లు చేయుట నీధర్మము.

(5) కుండలు చేయుటకు మన్నే ఆధారము. ఆభరణములు చేయుటకు బంగార మాధారము శివుని మార్గము తెలియుటకు గురు కృపయే ఆధారము. కూడల సంగమ దేవుని తెలియుటకు శరణుల సహవాసమే ఆధారము.

(6) నామనసునందు మఱియొకటి భావించనయ్యా! ఓం నమః శివాయ, ఓం నమః శివాయ యని పలుకుదును. పలుకుదును. నాకిదే మంత్రము, తంత్రము, జపము, తపము. కూడల సంగమ దేవా!

(7) పతి విశ్వాసము పొందని సతి, శివలింగముమీద నిష్ఠ లేని భక్తుడు ఉండిన నేమి, ఊడిన నేమి, కూడల సంగమ దేవా!

(8) పంజరము భద్రముగా నున్నదని భయము లేక పలుకాడుచున్న ఓ చిలుకా! నీ కెప్పుడును చావు రాదని భావింతువా? మాయామార్జాలము (మృత్యువు) వచ్చి నిన్ను గ్రహించునప్పుడు పంజరము నిన్ను రక్షించునా? కూడల సంగమదేవుడు తప్ప.

(9) ఆడుచు పాడుచు లింగమును పూజించవచ్చు. అది యాచింపదు; మాట్లాడదు. అందుచే నైవేద్యము పెట్టవచ్చు. బలాత్కారముగా యాచించు జంగమము వచ్చిన, ఆతనికి పెట్టుటకు మనసు రాదయ్యా! కూడల సంగమ దేవా!

(10) నీరుపోసిన నానదు; పోయకుండిన వాడిపోదు. ఇదియే లింగార్చన. జంగములకు పోసిన లింగమునకు తృప్తి కలుగును. కూడల సంగమ దేవా!

(11) దేవుడు సర్వభూతాత్ముడని వట్టిమాటలు చెప్పిన ఫలమేమి ? గురులింగజంగమములకు తనుమనోధనము లర్పణజేసినప్పుడే సర్వభూతాత్ముడైన దేవుడు తృప్తి నొందును.

(12) గురులింగజంగమములకు నేను సేవకుడనని చెప్పుచు, అట్లాచరింపనిచో, నీవు పలికెడి పలుకులు, పాడెడి పాటలు, చదివెడి చదువులు వ్యర్థము.

(13) మానవుడు వినయశీలుడై మనవలెను. మృదువుగా భాషించుట నేర్వవలెను. గుణవంతుల నెవరిని గాంచి నను శరణనవలెను.

(14) సజ్జనుల జూచి సంతసపడవలెను. గురుపాదము పట్టి పావనుడు కావలెను. పరమగురు పాదోదకములు సేవించి భవబంధములనుండి ముక్తుడు కావలెను.

(15) మనుష్యుని ఉన్నతికి గురుకటాక్షమే సోపానము. గురువువలననే మోక్షమునకు కారణమైన శివలింగము లభించును. అందుచే ఎల్లప్పుడు గురుని సేవ విడువరాదు.

(16) నైబడు పామున కడలను; మండెడు జ్వాలకు నదరను; కరాసిమొనకు వెరువను, ఒక్కదానికే అడలెద; పరవనితా వ్యసనమునకు వెఱతును; మున్నడలని రావణు డేమాయె; అడలెదనయ్యా కూడల సంగమదేవా !

(17) పాలు దూడ యెంగిలి; నీరు చేపల యెంగిలి; పూలు తుమ్మెద యెంగిలి; శివ శివా యెటులపూజింతు; ఈ యెంగిలి నతిక్రమింప నాతరమా నె ? కలదాని నైకొనుమా కూడల సంగమదేవా !

(18) వ్యాధు డొకకుందేటిని దెచ్చిన మూగిరయ్యా వెలయిచ్చి కొనుటకు; నరపతి పీనుగుకాగా వక్కాకుకైనా కొనువారు లేరు; శశకంబుకన్న హీనము నరుని బ్రతుకు; నెరనమ్ముము మా కూడల సంగమ దేవుని.

(19) తా ననుభవించు రతి, తా దినెడి భోజనము, ఇంకొకనిచేత చేయింపగా నగునె, దేవునికి నిత్యార్చనలు తాఁ జేయవలెగాని మఱియొకనిచే చేయింపవచ్చునే; నిన్నెటు తెలియగలరు కూడల సంగమ దేవా!

(20) జాతినాగులకు పాలను బోతురు; జాతినాగులను చంపగ జూతురు; తినెడి జంగము రాగా నడువు డందురు; తినని లింగమునకు భోజన మిడెదరు కూడల సంగమ దేవా!

(21) ద్వైతాద్వైతములు చదివి యేమి సాధింతురయ్యా! మా శరణుల గనినంత లక్కవలె కరగనంతవరకు స్థావరజంగమ మొకటే యని నమ్మనంతవరకు, వట్టి చదువుల ఫల మేమి? కూడల సంగమ దేవా!

(22) నరకువాడే మాదిగ; హొలసు తినువాడె మాల; వారి దేకులమైనాసరే! సకలజీవాత్మలకు సుఖములు గోరెడి కూడల సంగని శరణులే కులజులు.

(23) దయలేని ధర్మ మదెట్టిదయ్యా; దయయే వలయు సకలప్రాణులకును; దయయే ధర్మపు మూలమయ్యా, కూడల సంగయ్య అటుగానిది ఒల్లడయ్యా!

(24) భక్తి యనెడి నేలనుండు, గురువనెడి బీజము మొలిచి, లింగమనెడి ఆకైనది; ఆ ఆకుమీద విచారమనెడి

పుష్పమైనది; ఆచారమనెడి కాయ యైనది; నిష్పత్తి యనెడి ఫలమైనది; ఈఫలము తొడిమ ఊడి క్రిందపడగా తనకే కావలెనని గ్రహించును కూడల సంగయ్య.

## 17. ఉపసంహారము

వీరశైవమత మతిప్రాచీనమయినది. దానిని పూర్వ యుగములందే, శివుని సద్యోజాతాది పంచముఖములనుండి వెలువడిన పంచాచార్యులు సంస్థాపించి రనునది వీరశైవుల విశ్వాసము. అదిగాక 5, 6 వేల సంవత్సరములకు పూర్వమే జనులలో లింగధారణ, లింగపూజాదికము లున్నట్లు మొహెంజోదారో, హరప్పా త్రవ్వకములవలన నిటీవల వెల్లడియైనది. ఆంధ్రదేశములోనే గుంటూరుజిల్లా వినుకొండ తాలూకా బొగ్గరంగ్రామ సమీపములో నున్న భోగవరం క్షేత్రములో శ్రీ ప్రసన్నాంజనేయసమేత వేణుగోపాలస్వామివారి ఆలయ ప్రాంగణములో శిథిలావస్థలోనున్న సోమేశ్వర దేవాలయ గర్భాలయములో 2–1–75 తేదీన మధ్యాహ్నము 2 గంటలకు, మూడు వేల సంవత్సరములనాటి సోమేశ్వర లింగము భూమిబ్రద్దలై బయల్పడినదనియు, అనేకమంది భక్తులు తేదీ స్వామిదర్శనము చేసికొనుచున్నారనియు వార్త 13–1–75 ఆంధ్రప్రభ దినపత్రికలో ప్రచురితమయినది. కావున వీరశైవమత ప్రాచీనత గుఱించి రెండు అభిప్రాయాలకు తావే లేదు కాని పదునొకండవ శతాబ్దికి పూర్వము వీరశైవ మతమునుగూర్చియు, తన్మతావలంబుల గూర్చియు ప్రమా

ణిక గ్రంథములు లభ్యముగాని కారణమువలన పలువురు విద్వాంసులు బసవేశ్వరుడే వీరశైవమత సంస్థాపకుడని తలంచిరి. ఇది సరియైన అభిప్రాయము కానేరదు. బసవేశ్వర జననమునాటికే దేశములో వీరశైవ మతములు, జంగమయ్యలు ఉన్నారు. వీరే అసంఖ్యాకులుగా బసవేశ్వరు డొనర్చిన గణార్చనలలో పాల్గొనుచుండిరి బసవేశ్వరుని వివాహ సమయమున గూడ శివరహస్యాగమనిగమానుభవవేదులైన జంగమయ్యలు వచ్చిరి; వారిని పాదపూజలు చేసి పాదోదకమును బసవేశ్వరుడు శిరముపై చల్లికొని పెండ్లికుమారుడాయెను. ఇదిగాక వీరశైవ గ్రంథములలో దేనియందును గూడ బసవేశ్వరుడు వీరశైవమతస్థాపకుడని చెప్పబడియుండ లేదు.

కావున బసవేశ్వరునికి పూర్వము వీరశైవము పరిమితముగా నున్నట్లును దానికి తగినసంస్కరణలను జోడించుచు బసవేశ్వరుడు బహుళవ్యాప్తిని గావించినట్లును నేటి విజ్ఞులు అభిప్రాయపడుచున్నారు. ముఖ్యముగా ఆయన ప్రవేశపెట్టిన సంస్కరణలు కులనిర్మూలనము, అస్పృశ్యతానివారణము, స్త్రీపురుష సమానత్వము, ఏకేశ్వరోపాసనము నైయున్నవి. అప్పటికె స్థిరముగా పాతుకొనియున్న వర్ణవ్యవస్థ నాతడు కూకటివ్రేళ్ళతో పెకలించెను. లింగధారణ, లింగారాధన, తద్ద్వారా మోక్షప్రాప్తికి సర్వవర్ణములకు సమా

సార్వత యున్నట్లు ఆయన బోధించుటయేకాక ఆచరించి చూపించెను. అంత్యజులకుగూడ శివదీక్ష లొసంగి తన్మూల మున అస్పృశ్యతా నివారణకు, పతిత జనోద్ధరణకు పాటు పడిన మహాత్ముడు బసవేశ్వరుడు. మఱియు దీక్షాస్వీకారము, లింగపూజ, జంగమారాధన, అష్టావరణ, పంచాచారము లన్నియు స్త్రీపురుషులకు సమానముగా విహితము లొనరించి స్త్రీపురుషసమానత్వమునుగూడ సాధించెను. అప్పటికి అమ లులోనున్న అనేక దేవతారాధనను నిరసించి శివుడే యేకైక దైవమను ఏకేశ్వరోపాసనను ఆయన యుద్బోధించెను. కావు ననే అచిరకాలమున లక్షలాదిగా జనులు వీరశైవము నవలం బించుట కాస్కారము కలిగినది; ముఖ్యముగా మహారాష్ట్ర, కర్ణాటక, ఆంధ్రరాష్ట్రములలో వీరశైవము బహుళవ్యాప్తి నంది నేటికిని జీవకళాచైతన్యముతో భాసిల్లుచున్నది.

బసవేశ్వరుని కేవల మవతారపురుషునిగా నభివర్ణించి, ఆతనికి శివునకు భేదము లేమిని బోధించి, పాలకురికి సోమనా థుడు తన కృతులలో బసవేశ్వరునియెడ అనన్యమగు భక్తి ప్రపత్తులను ప్రదర్శించియున్నాడు. నేటికిని వీరశైవులు శివా! యనినను, బసవా! యనినను నొక్కటిగానే భావించి, బస వేశ్వరభక్తిని నిత్యజీవితములో పాటించుచునేయున్నారు.

బసవేశ్వరుని గురించిన గాథలలో ఆత డెట్లు వర్ణింప బడినను, భారతీయులలో స్వతంత్రభావోపేతు లైన తత్త్వ

వేత్తలలో నాతడే ప్రథమగణ్యుడు కాదగునని ప్రసిద్ధ పాశ్చాత్య తాత్త్వికుడు ఆర్థర్ మైల్సు మహాశయుడు వక్కాణించియున్నాడు. 19, 20 శతాబ్దములలో శ్రీ రాజా రామమోహనరాయ్, కందుకూరి వీరేశలింగము పంతులు, గాంధీ మహాత్ముడువంటి సంఘసంస్కర్తలు తలపెట్టిన సంస్కరణలను దూరదర్శియగు బసవేశ్వరుడు పండ్రెండవ శతాబ్దియందే బోధించి, ఆచరించి, చూపించిన విధమును గమనించిన ప్రపంచజిజ్ఞాసువులెందఱో ముక్తకంఠముతో బసవన్నను కొనియాడుట వీరశైవులెల్లఱకు గర్వకారణ మని వేఱ చెప్పనక్కఱలేదు.

ఇంతేగాక 17–5–1918 తేదీ టైమ్సు ఆఫ్ ఇండియా పత్రిక "భారతీయ మత సాంఘికసంస్కర్తలందఱు నేదో యొకటి రెండురంగములలో మాత్రమే సంస్కరణలు తలపెట్టి మిగిలినవానిని విస్మరింపగా, బసవేశ్వరుడు సర్వతోముఖమైన సంస్కరణములు- స్త్రీజనాభ్యుదయముతో సహా- చేపట్టి అత్యంత ధైర్యసాహసములతో వాని నమలుపఱచియున్నా" డని యుగ్గడించినది.

కావున నెల్లరును బసవేశ్వరుని దివ్యచారిత్రమును పఠించి, ఆయన బోధనల నాచరించి, శివానుగ్రహమునకు పాత్రులై తరింపవలయునని వినయపూర్వకముగా అభ్యర్థించుచున్నాను.

## అనుబంధము—I

# బసవేశ్వరుని జీవితమందలి ముఖ్య సన్నివేశములు

చరిత్రపరిశోధకులకు తొలుదొల్త బసవేశ్వరుని గురించిన శాసనము లేవియు లభింపలేదు. బిజ్జలునిగూర్చిన శాసనములు కొన్ని దొరకినవికాని అందులో బసవేశ్వరుని నామము ఉదాహృతము కాలేదు. అందుచే బసవేశ్వరుడసలు చారిత్రకపురుషుడు కాదేమో యను ననుమానము కొందఱు బుద్ధిమంతులకు సహజముగా కలిగినది. వారియొక్క సంశయము నివృత్తి చేయుటకో యన్నట్లు బసవేశ్వరుని గూర్చిన శాసనము లిటీవల నుపలబ్ధములై బసవేశ్వరుని చారిత్రకతను నిస్సంశయముగా నిరూపించినవి. ఆ శాసనములలో ముఖ్యమైనది అర్జునవాడ శాసనము. బసవేశ్వరుని జీవితములోని వివిధఘట్టములును అవి జరిగిన సంవత్సరములును దిగువపట్టికలో ఉదాహృతము లయినవి.

## I బాల్యయౌవనదశలు

1. బసవేశ్వరుని జననము 1105 సం॥

2. ఉపనయన తిరస్కారము 1113

## III కూడల సంగమేశ్వర, మంగళవాడ. కళ్యాణములలో మతోద్ధరణ కృషి

| | |
|---|---|
| 12. సంగమేశ్వరుని సేవించుకొనుచు, విద్యాసముపార్జన చేయుచు, భావిమతసాంఘిక సంస్కరణలకు ప్రణాళికలు వేయుట | 1121-1132 |
| 13. మతోద్ధరణ కార్యక్రమ సక్రమనిర్వహణకు వీలుగా లౌకికోద్యోగ స్వీకారము | 1132 |
| 14 మత, సాంఘిక సంస్కరణోద్యమ ప్రారంభము | 1141 |
| 15. నూతనోద్యమ వికాసము; ప్రజాభిమానమును చూరగొనుట; జంగమయ్యలు యితరులు బహుళసంఖ్యలో నుద్యమములో పాల్గొనుట | 1141-1153 |
| 16. కళ్యాణమునకు వెళ్ళుట | 1153 |
| 17. కళ్యాణమునకు అల్లమ ప్రభువు రాక; ఆయన ఉద్యమమునకు పూర్తి చేయూతనొసగుట | 1153 |

| | | |
|---|---|---|
| 18. | బసవేశ్వరుని తత్త్వముయొక్క ప్రబోధ ప్రచారములు; ఉద్యమ విజయము | 1153-1167 |
| 19. | అల్లయ్య మధుపయ్యలపై బిజ్జలుని అత్యాచారము | 1167 |
| 20. | కళ్యాణములో సంక్షోభము; బిజ్జలునిపై ప్రతీకారము; బసవేశ్వరుడు కూడల సంగమేశ్వర మేగి సంగమేశ్వరునం దైక్యమగుట | 1167 |

పయిపట్టికలో నుదాహరింపబడిన కాలనిర్ణయము ననుసరించి లింగైక్యమునాటికి బసవేశ్వరుని వయస్సు 62 సం॥లు అని తేలుచున్నది. కాని ఆయన వయస్సు 36 సం॥లే యని చిరకాలమునుండియు జనులు పరంపరగా చెప్పుకొను చున్నారు. ఈ రెంటికిని సమన్వయము కుదురుట లేదు. బసవేశ్వరుడు తన మహోద్యమమును నడిపినది రమారమి 36 సం॥లు అగుటచే, ఆ 36 సం॥ల కాలమునే రానురాను జనులు పొరపాటున వాడుకలో బసవేశ్వరుని వయఃపరిమితిగా చెప్పుకొనుట జరగియుండనగునని, శ్రీ పి. బి. దేశాయిగారు రెంటిని చక్కగ సమన్వయపఱచియున్నారు.

# ఉపబంధము—II

## ఏతద్గ్రంథరచనలో

## నాకెక్కుడుగా తోడ్పడిన గ్రంథరాజములు:

---

1. బసవపురాణము
2. పండితారాధ్యచరిత్రము

} పాలకురికి సోమ నాథుని

3. వీరశైవ దర్శనము
4. శక్తి విశిష్టాద్వైతము
5. వ్యాసావళి ప్రథమభాగము
6. వ్యాసావళి ద్వితీయభాగము

} కీ॥ శే॥ శివశ్రీ పండిత బండారు తమ్మయ్యగారు

7. Basaveswara and His times: ధారవాడ యూనివర్సిటీ చరిత్రశాఖాధ్యక్షులు కీ॥ శే॥ శ్రీ పి. బి. దేశాయి గారు.
8. లోకారాధ్య బసవేశ్వరుడు. శ్రీశైల సూర్యసింహాసనాధీశ్వర శ్రీ శ్రీ శ్రీ జగద్గురు వాగీశ పండితారాధ్య శివాచార్య మహాస్వాములవారు, గుంటకల్లు.
9. ఆంధ్రదేశములో వీరశైవము: విశాఖపట్టణము సెయింట్ జోసఫ్ స్త్రీలకళాశాల చరిత్రోపన్యాసకురాలు కుమారి కె. లలితగారి పరిశోధనా వ్యాసము.
10. బసవవచనామృతము: శ్రీ బొడాల రామయ్య గారు, M. A.
11 ద్విపద ప్రభులింగలీల: పిడుపర్తి సోమనాథుని

పయిరచయితల కందఱకును నా కృతజ్ఞతాపూర్వక నమోవాకములు.

ఓం తత్సత్.

## BASAVESWARA'S SAYINGS

( Translated from Kannada to English )

The Condemned lamb if brought
to the sacrificial fire;
it sees the decorative green
and nibbles the leaves in glee.
It is innocent
of its impending doom—
it gloats on its present joy.
Even such are all earthly joys
Oh Lord! Kudala Sangama!

The nectar of Thy name my tongue tastes,
Thy image is ever my eye's target
And the music of Thy fame in my ear rings,
I am an humble bee buzzing about Thy Lotus feet,
Oh Lord! Kudala Sangama.